Photo by S. H. Kotak



పంపినవారు :
సుశీలాదేవి - విశాఖపట్నం

బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆట మాణిక్యమే, పాట మాణిక్యమే....

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



రాజకీయాల్లో ఆసక్తి కొందరికి...





కాని, ప్రతీవారికి ఆసక్తి




Parry's ప్యారీస్

మిఠాయీల్లోనే

ఎందుకంటే, అవి అంత రుచిగలవి, అంత పరిశుభ్రమైనవి, అంత ఆరోగ్యమైనవి

తయారుచేయువారు : ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మదరాసు

PRS 276




# లిలీస్
# మాల్టో
## బిస్కత్తులు

బిడ్డలకు ప్రియమైనవి.

**LILY BISCUIT CO. PRIVATE LTD., CALCUTTA-4**

---

# అశోకా ఫ్లవర్ ఆఫ్ హెవెన్ టాల్కం
# పౌడరు అండ్ స్నో




గగన కుసుమమువంటి ఈ అపూర్వ సౌంద ర్యోపకరణములు, విజయా కెమికల్సువారి సుదీర్ఘ పరిశోధనా ఫలితముగా తమకు లభించుచున్నవి. నవీనమయిన కెమికల్సువల్ల, పరిమళ ద్రవ్యములవల్ల అత్యుత్తముగా తయారైనవి. వీటి ఉపయోగమువల్ల మీ సౌందర్యమును, ముఖ వర్చస్సును, యినుమడింపచేయును. ఉపయోగించిన అతి శీఘ్రకాలములోనే వీటి గుణములు మీరు గమనించగలరు. నేడే ఉపయోగింపుడు.

**విజయా కెమికల్స్,**
**మద్రాసు-7.**

ఏజంట్లు : గుడ్ విల్ ఏజన్సీస్, బెజవాడ.

# ఇది చదివితే మీరు ఆశ్చర్యపడతారు

రోమన్ చక్రవర్తి, నీరో, కాలంలో గాజుగ్లాసు ధర రు. 27,000/- వుండేది! అభాగ్యుడైన బానిస గ్లాసును పగులగొట్టితే ప్రాణాంతకమే ఆ గ్లాసులే ఇప్పుడు ఒక్కొక్కటి అయిదారు అణాలకు ఏ దుకాణంలోనైనా దొరుకుతున్నాయి.





రాజ బొక్కసమునకు అలవిగాని వస్తువు లున్నాయి. బాబర్ చక్రవర్తి కుమారుడు హుమాయూన్‌కు ఒకమాటు చాలా జబ్బుచేసింది. వైద్యులంతా ఆశ వదులుకొన్నారు. బాబర్ తన కుమారుని పడక చుట్టూ ప్రదక్షిణం చేసి, ఇలా ప్రార్థించాడు: "ఓ దేవా నా కుమారుని రక్షించి నా ప్రాణము



తీసుకో!" ఆయన ప్రార్థన ఫలించింది; ఈనాడు గాజుగ్లాసు అతి చౌకైపోయింది. కాని ఆరోగ్యము, ఇప్పటికీన్నీ, బాబర్ హుమాయూన్ కాలంలోవలెనే,




అమూల్యమైయున్నది. అయితే మురికి ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదం. మనము మురికికాకుండా తప్పించుకోలేము. మురికిలో వ్యాధిని గలిగించే క్రిములున్నాయి. లైఫ్‌బాయ్ సబ్బు ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడును. రోజల్లా హాయిగా నుండుటకు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేయండి.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారు. L. 279-50 TL



# గంగా దృశ్యము

మన విశాలమైన, విచిత్రమైన భారత దేశములో పెద్ద నదులన్నిటిలోను గంగానది అతి ప్రఖ్యాతమైనది, అత్యంత ఉపకారశాలి.

గంగా నది మంచుతో కప్పబడిన హిమాలయ పర్వతాలలో ఉద్భవించి చాల ఎత్తునుండి మంచు కరగిన నీటితో క్రిందకు ప్రవహిస్తూంది. ఈ పరిసరాలు నిశ్చల, ప్రశాంత వాతావరణము సౌందర్య శోభాయమానమూ కలిగి వున్నాయి. ఇంకా క్రింద మైదానములో యీ గంగా ప్రవాహము గంభీరమైన నదియై, ఎడతెరిపిలేని రహదారి మార్గమై ప్రశాంతముగా సముద్రంలోకి ప్రవహిస్తూంది.

గంగానది యిరువైపులు స్నాన ఘట్టాలు, పడవ రేవులతో నిండి వున్నాయి. ఒక ఒడ్డునుంచి మరియొక ఒడ్డుకు పడవలు, మనుష్యులను, సరకులను, రవాణా చేస్తూన్నాయి. తరచుగా ఆ సరకులలో "బ్రూక్ బాండ్ టీ" మార్కుగల టీ పెట్టెలు కూడ కనిపిస్తాయి. అవును మరి! దేశములో ప్రతి చోటలాగే ఈ గంగా మైదానములో కూడ "బ్రూక్ బాండ్ టీ"నే ప్రజలు హర్షిస్తారు. రేవులదగ్గర అంగళ్లు, టీ దుకాణాలు ప్రయాణీకులకు టీ అందజేస్తాయి. పడవవాళ్లు పడవను తోసేముందు, తర్వాత సాయంకాలము పని ముగిసింతర్వాత టీ త్రాగుతారు.

గంగా మైదానము గంగయొక్క ప్రసాదమే. ఈ నది ఒండ్రు మట్టిని క్రిందకు తీసుకువచ్చి ఈ పల్లపు ప్రదేశాలని ఫలవంతం చేస్తూంది. ఆ చిక్కటి మృదువైన మట్టి వివిధములైన పంటలను విరివిగ నిచ్చి కోట్లాది ప్రజలకు ఆహారము సమకూరుస్తూంది. ఈ మైదానము హిందూ దేశమునకు ధాన్యపు గాదె అనడంలో ఆశ్చర్యము లేదు. అలాగ గంగా నది భూమిని సారవంతము చేస్తూంటే, బ్రూక్ బాండ్ టీ తన యొక్క తాజాతనము, సువాసనా పరిమళములతో ప్రజలకు అమితోత్సాహము యిస్తూంది.

BB 235

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్





ఎప్పుడు దేనితోను
ఫలితం కనబడదో...



... మేనర్స్
గ్రైప్ మిక్చర్ యిచ్చి

దానికి బదులు వచ్చే
చిరునవ్వు చూడండి




"మదర్‌క్రాఫ్ట్ అండ్ చైల్డ్ కేర్" అను మా 40 పేజీల పుస్తకానికి వ్రాయండి. ప్రతి సీసాతోడు వుండే కూపన్‌తో పాటు, మీ చిరునామా, 40 నయాపైసల స్టాంపులతో పహ్ పోస్ట్ ఆఫీస్ బాక్స్ 976, బొంబాయి 1, కి వ్రాయండి.

మంచి రకాలలో శ్రేష్టమైన యీ చిహ్నం చూడండి.  ఇది మేనర్స్ ఉత్పత్తి

GEOFFREY MANNERS & CO. PRIVATE LTD., BOMBAY - DELHI - CALCUTTA - MADRAS.

ASP/GM6

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

పురాణకాలంలో జరిగిన భయంకరమైన యుద్ధాలలో భారతయుద్ధం ఒకటి. పాండవులు రాజీరాయబారం పంపుతూనే యుద్ధయత్నాలుకూడా సాగించారు.

అలాటి పరిస్థితులలోనే దేశాలమధ్య యుద్ధాలు తప్పనిసరిగా జరుగుతాయి. ఈనాటి ప్రపంచం శాంతిని కోరుతోంది. యుద్ధయత్నాలు చాలించి రాజీబేరాలు నడిచినప్పుడేగాని ప్రపంచానికి సుస్థిర శాంతి చేకూరదని మనం భారతకథ నుంచి నేర్చుకోవచ్చు.

సంపుటి 22 జూన్ 1958 సంచిక 6



# అక్షయిహిణి బోమ్మ

ద్రుపదుడి పురోహితుడు హస్తినాపురానికి బయలుదేరగానే పాండవులు, రానున్న యుద్ధంలో తమ పక్షాన ఉండమని కోరుతూ అనేకమంది రాజులవద్దకు దూతలను పంపారు. కృష్ణుడి సహాయం వేడటానికిగాను అర్జునుడు స్వయంగా ద్వారకకు బయలుదేరాడు.

పాండవుల యుద్ధ యత్నాలు వేగులద్వారా తెలుసుకుంటూ ఉన్న దుర్యోధనుడుకూడా కృష్ణుడి సహాయం కోరటానికి స్వయంగా ద్వారకకు బయలుదేరాడు. అర్జున దుర్యోధనులు ఒకరోజే ద్వారక చేరారు. దుర్యోధనుడు కృష్ణుడి మందిరంలోకి కొంచెం ముందుగా అడుగు పెట్టాడు. కృష్ణుడు నిద్ర పోతూ ఉండటంవల్ల, ఆయన తల వేపున ఉన్న ఆసనంలో దుర్యోధనుడు కూచున్నాడు. మరి కాస్సేపటికి అర్జునుడు వచ్చి కృష్ణుడి కాళ్ళదగ్గిర నిలబడ్డాడు.

కృష్ణుడు నిద్రలేస్తూనే అర్జునుణ్ణి చూసి తరవాత దుర్యోధనుణ్ణి చూశాడు. ఆయన వారిద్దరినీ సమంగా ఆదరించి వచ్చిన పని అడిగాడు. దుర్యోధనుడు తాను వచ్చిన పని చెప్పి, "దేవా, నీకు పక్షపాతం లేదు. నేనూ, అర్జునుడూ ఒకటే. కాని ముందుగా వచ్చినవాణ్ణి నేను. అర్జునుడు నా తరవాత వచ్చాడు. అందుచేత నాకు సహాయం చెయ్యటం ధర్మం," అన్నాడు.

"ముందుగా నేను అర్జునుణ్ణి చూశాను. అందుచేత మీ ఇద్దరికీ సమంగా సహాయం చేస్తాను. నేను అస్త్రం ధరించను. కాని అస్త్రశస్త్రాలతో పోరేవారు నా కింద పదిలక్షలమంది నారాయణులు ఉన్నారు. వారు ఒక వేపూ నేను ఒక వేపూ ఉంటాం," అన్నాడు కృష్ణుడు.

అర్జునుడు కృష్ణుణ్ణి కోరుకున్నాడు. దుర్యోధనుడు నారాయణులను కోరుకున్నాడు. తరవాత దుర్యోధనుడు బలరాముని వద్దకు వెళ్ళి సహాయం కోరాడు. కాని బలరాముడు తాను ఏపక్షానా చేరనని చెప్పాడు. కృతవర్మ దుర్యోధనుడికి ఒక అక్షౌహిణీ సేన ఇచ్చాడు.

దుర్యోధనుడు వెళ్ళిపోయాక కృష్ణుడు అర్జునుడితో, "పది లక్షలమంది నారాయణులను కోరక, అస్త్రం పట్టని నన్నెందుకు కోరుకున్నావు?" అన్నాడు.

"దేవా, నీవు యుద్ధంచేస్తే నాకేమి ఖ్యాతివస్తుంది. యుద్ధంలో నీవు నాకు సారథివిగా ఉంటే అదే నాకుచాలు!" అన్నాడు అర్జునుడు. కృష్ణుడు సమ్మతించాడు.



# పేదపడుచు

రామాపురం అనే గ్రామంలో వీరయ్య అనే రైతు ఉండేవాడు. అయన పొదుపుగా జీవించి తనకు గల భూవసతిని పెంచుకుంటూ వస్తున్నాడు. అయనకు రఘు అని ఒకడే కొడుకు. రఘుకు పెళ్లియీడు వచ్చింది. వాడికి కట్నంతో పిల్ల వస్తే, ఆ కట్నంసొమ్ముకు తనవద్ద కూడబెట్టిన సొమ్ము చేర్చి మరికొంత పొలం కొనే ఉద్దేశంలో ఉన్నాడు వీరయ్య. అయితే రఘుకుమాత్రం పెళ్లిచేసుకోవాలనే ఆలోచన ఇంకా కలగలేదు.

ఒకనాడు పండగ వచ్చింది. సంబరం చూడటానికి ఊళ్లో ఉన్న కూలిజనం దగ్గిర నుంచీ వెళుతున్నారు. రఘుకూడా వేడుక చూడటానికి బయలుదేరాడు. అతను తమ మొక్కజొన్న చేను దగ్గిరికి వచ్చేసరికి, చేలో కలుపు ఏరుతూ లక్ష్మి అనే పిల్ల కనిపించింది.

లక్ష్మి తండ్రి ఒకప్పుడు బాగా బతికిన రైతే. కాని కాలం కలిసిరాక అప్పులపాలై, ఉన్నదంతా పోగొట్టుకుని, పేదరికం అనుభవించి చనిపోయాడు. లక్ష్మి తల్లి అంతకు ముందే చనిపోయింది. అనాథ అయిన లక్ష్మిని నాయనమ్మ పెంచి పెద్దచేసింది. ఇప్పుడా నాయనమ్మ చాలా ముసలిదైపోయింది. ఆవిడకు కళ్లు సరిగా కనబడవు, చెవులు వినపడవు. లక్ష్మి రెక్కలకష్టంమీద తన పొట్టపోసుకుంటూ ముసలిదాన్నికూడా పోషిస్తున్నది. వాళ్లిద్దరూ ఒక పాకలో నివసిస్తున్నారు.

రఘు లక్ష్మిని చూసి ఆగి, "ఏమే, లక్ష్మి ? ఊళ్ళోవున్న జనమంతా సంబరానికి పోతుంటే నువు యిక్కడ పని చేస్తున్నావేం ?" అని అడిగాడు.

"పోవటానికి వీలుంటే ఎందుకు పోనూ ?" అన్నది లక్ష్మి.

ఎస్. శకుంతల



"కలుపు తీసినందుకు మా నాన్న ఎంత ఇస్తానన్నాడేం?" అన్నాడు రఘు.

"పని పూర్తిచేస్తే రెండణాలిస్తారు," అన్నది లక్ష్మి.

"ముష్టి రెండణాలేనా? నేనిస్తాలే. వెళ్లి సంబరం చూసి రా!" అన్నాడు రఘు.

"నాకక్కర్లేదు. నాకు డబ్బు రావటమేనా? చేస్తానన్న పని చెయ్యాక్కర్లేదా?" అన్నది లక్ష్మి.

రఘు మారు మాట్లాడకుండా చొక్కా విప్పి ఒక పక్కన పెట్టి, చేలో ప్రవేశించి ఇంకొక పక్కనుంచి తానుకూడా కలుపు తీయసాగాడు. కలుపుపని త్వరగా అయిపోయిందిగాని, అలవాటు లేకపోవటంచేత రఘు అలిసిపోయాడు. అతని మొహమంతా చెమటలు దిగగారాయి.

లక్ష్మి అతన్ని వేళాకోళం చేసి, "నాపని చేసిపెట్టావు గనక మాయింటికి రా, పానకం ఇస్తాను," అన్నది.

రఘు లక్ష్మివెంట వాళ్ల ఇంటికి వెళ్లాడు. అదివరకెన్నడూ అతనా పాకలో అడుగు పెట్టలేదు. పేదవాళ్ల ఇల్లయినా ఆ పాక అద్దంలాగా అమర్చివున్నది. లక్ష్మి నాయనమ్మ ఊరికే రుసరుసలాడే రకం. "పాపం, ఈ ముసలిదానితో లక్ష్మి ఎంత ఓర్పుగా కాలక్షేపం చేస్తున్నదో!" అనుకున్నాడు రఘు జాలిగా.

లక్ష్మి రఘుకు తాగటానికి పానకం ఇచ్చింది. అక్కడినుంచి రఘు వెనక్కు తిరిగి ఇంటివేపు వచ్చాడు. అతను పశువుల దొడ్డిదగ్గిరికి వచ్చేసరికి అతని తండ్రి వీరయ్య ఒంటరిగా దొడ్డికంచె బాగుచేస్తూ కనిపించాడు.

ఆయన తన కొడుకును చూసి, "ఒరే, రఘూ, కాస్త సాయం రారా! పనివాళ్లంతా సంబరానికి వెళ్లారు. ఈ కంచె బాగుచేద్దామంటే ఒక్కడూ లేడు. అందుచేత నేనే కష్టపడవలసి వచ్చింది," అన్నాడు.





రఘు తండ్రికి సాయంచేయసాగాడు. కొడుకు పరధ్యానంగా ఉండటం కనిపెట్టి వీరయ్య, 'ఏమిట్రా ఆలోచిస్తున్నట్టున్నావు?' అని అడిగాడు.

"ఏమీలేదు, నాన్నా. పెళ్లి చేసుకోమని నువ్వూ, అమ్మాకూడా నాతో చాలాసార్లు అన్నారు. కాని తగిన పిల్ల దొరకక ఇన్నాళ్లూ నేను మాట్లాడలేదు. ఇప్పుడు నాకు తగిన పిల్ల దొరికింది, నాన్నా!" అన్నాడు రఘు.

"ఎవర్రా ఆపిల్ల?" అని తండ్రి అడిగాడు.

"లక్ష్మి," అన్నాడు రఘు.

"మన ఇంటికి అప్పుడప్పుడూ పనికి వచ్చేపిల్లా?" అన్నాడు వీరయ్య.

"అవును. అదే నాకు తగిన భార్య," అన్నాడు రఘు.

వీరయ్య కొంచెం ఆలోచించి, "ఒకప్పుడు వాళ్లుకూడా మనమాదిరిగా బతికినవాళ్లే ననుకో. అదీగాక లక్ష్మి బుద్ధిమంతురాలే. కాని వాళ్లు బొత్తిగా దరిద్రులే!" అన్నాడు.

"వాళ్ల భాగ్యంతో మనకేం పని, నాన్నా. అది బుద్ధిమంతురాలు, పనిమంతురాలు, అందంగా వుంటుంది," అన్నాడు రఘు.

"నిజమే! నన్నడిగితే అవశ్యం చేసుకో మంటాను. కాని మీ అమ్మ వట్టి పిసినిగొట్టు. పాలూ, పెరుగూ, నెయ్యీ అమ్మిన బాపతు ఒక్క దమ్మిడీకూడా నాకు చూపదు. అంతా ఎక్కడో పాతేస్తుంది. మీ అమ్మ ఈ సంబంధానికి చచ్చినా ఒప్పదు," అన్నాడు వీరయ్య.

ఆరోజే రఘు తల్లితో లక్ష్మిని తాను పెళ్లి చేసుకునే విషయం చెప్పాడు. ఆవిడ అంతా విని, "నీకిష్టమై లక్ష్మిని చేసుకుంటానంటే నేను వద్దంటానుట్రా? కాని మీ నాన్నకు ఎంత డబ్బు కావలెనమో నువ్వెరగవు. నువు ఏమీ కట్నంలేకుండా ఎవరో పేదపిల్లను పెళ్లాడతానంటే ఆయన ఎంతమాత్రమూ ఒప్పడు!" అన్నది.



ఆ తరవాత వీరయ్యా, ఆయన భార్యా కూడబలుక్కున్నారు. వీరయ్య భార్యకు దుర్గ అని ఒక వేలువిడిచిన మేనగోడలున్నది. దుర్గను రఘు కిచ్చి చేయాలని ఒకప్పుడు పెద్దవాళ్లు తమలో అనుకున్నారు. ఆ దుర్గకు అయిదారు వందల రూపాయల విలవ గల ఆస్తి వున్నది. ప్రస్తుతం ఆ పిల్ల బస్తీలో వుంటున్నది. ఆ దుర్గను తీసుకు వచ్చి ఒక నెలరోజులపాటు తమ ఇంట్లో ఉంచుకుంటే, రఘు మనస్సు లక్ష్మిమీద నుంచి దుర్గమీదికి మళ్లుతుందని వీరయ్యా, భార్యా అనుకున్నారు. ఈ విధంగా పేదపిల్ల కోడలుగావచ్చే ప్రమాదం తప్పుతుంది.

వీరయ్య ఏదో మిషమీద బండిచేసుకుని బస్తీ వెళ్లి దుర్గను తీసుకువచ్చాడు. ఈ దుర్గకు అందంకన్న అడంబరం హెచ్చు, తెలివితేటలకన్న అహంకారం జాస్తి. తన కున్న ఆస్తి అయిదువందలే అయినా, తానొక లక్షాధికారిణి అన్నట్టుగా ప్రవర్తించేది. ఆమె వచ్చినది మొదలు ఇటువస్తువు అటు పెట్టలేదు. తాను కూర్చున్న చోటనల్లా చెత్త చేర్చేది. తన సొంతపనులకుకూడా అందరినీ పురమాయించేది. పల్లెటూళ్ళో తనకు ఏమీ తోచటంలేదనేది. విసుగూ విరామమూ లేకుండా వాగుతూ, ఇతరులను పనులు చేసుకోనిచ్చేదికాదు.



రఘుతో తల్లి, "నాయనా, దుర్గ బస్తీలో పెరగటంవల్ల కొన్ని బస్తీపద్ధతులు నేర్చుకున్నప్పటికీ, దాని మనసు మంచిది. అది నీకు పెళ్లామయితే మనకు అయిదువందల రూపాయల ఆస్తి కలిసివస్తుంది. మీ నాన్న ఎంత సంతోషిస్తాడో చెప్పలేను. అందుచేత నువు దాన్ని సంతోషపెట్టటానికి ప్రయత్నించు," అన్నది.

"సరేనమ్మా!" అన్నాడు రఘు.

కాని దుర్గ ప్రవర్తన నానాటికీ దుర్భరం కాసాగింది. ఆమెచేత తిట్లు పడలేక ఇద్దరు కమతగాళ్లు పని మానేశారు. ఆవుకు జబ్బు చేసింది. దాన్ని చూసే మనిషి లేడు. వీరయ్య కొడుకుతో, "ఒరే నువు కాస్త ఆవును కనిపెట్టి వుండాలిరా!" అన్నాడు.

"నేను బస్తీ వెళుతున్నాను, నాన్నా. దుర్గకు ఏవో వస్తువులు కావాలిట!" అన్నాడు రఘు.

వీరయ్య భార్యకు, ఏంచెయ్యాలో తోచలేదు. రెండురోజులపాటు సహాయం రమ్మని లక్ష్మికి కబురుచేస్తే, లక్ష్మి నాయనమ్మకు పక్షవాతం వచ్చిందనీ, లక్ష్మి ఇల్లు కదిలే స్థితిలో లేదనీ తెలిసింది.

బస్తీ వెళ్లిన రఘు పదిరూపాయలు తగలేసి దుర్గ కోరిన సామానులన్నీ తెచ్చాడు. ఆ రోజే వీరయ్యా, భార్యా కష్టసుఖాలు



మాట్లాడుకున్నారు. "ఈ దుర్గ వచ్చినప్పటి నుంచీ అన్నీ తారుమారే! ఒట్టి సోమరి పోతు! నన్ను నౌకరులాగా చూస్తుం దేమిటి? ఎన్ని వస్తువులు పగలగొట్టిందో చెప్పలేను. నిక్షేపమంటి ఇల్లు నరకంలాగా అయిపోయింది! నాకు మతి పోతున్నది!" అన్నది భార్య.

"అది ఒకటేనా? మన రఘు దానికి బానిస అయిపోయాడు. ఇది ఆస్తి తెచ్చేమాట ఎలా వున్నా, దానికి పదింతలు వాడిచేత ఖర్చు చేయిస్తుంది, చూస్తూవుండు!" అన్నాడు వీరయ్య.

ఇద్దరూ కలిసి దుర్గను పంపించెయ్యా లని నిశ్చయించారు. వీరయ్య ఏదో పనిమీద బస్తీకి వెళ్లవలిసినట్టు నటిస్తూ దుర్గనుకూడా వెంటబెట్టుకు వెళ్లాడు.

ఆరోజే వీరయ్యభార్య లక్ష్మి ఇంటికి వెళ్లి, "లక్ష్మి, మీ నాయనమ్మ ఈస్థితిలో వుండగా నిన్ను రమ్మనటం బాగుండదు. మీరిద్దరూ మా ఇంటికి వచ్చి అక్కడే వుండండి. నాకు మనిషి తోడు లేకుండా జరగదు. మీ నాయనమ్మకు కావలిసిన సదుపాయాలన్నీ నేను చేస్తాను!" అన్నది.

ఆరోజే లక్ష్మి తన నాయనమ్మతోసహా వీరయ్యగారింటికి వచ్చేసింది.

లక్ష్మి అడుగుపెట్టగానే మళ్ళీ ఇల్లు ఎప్పటిలాగయింది. ఇల్లు తీర్చిదిద్దటంలో లక్ష్మి చాలా సమర్థురాలు.

కొన్నిరోజులు గడిచాక వీరయ్య రఘుతో, "వెనక ఎప్పుడో లక్ష్మిని చేసుకుంటా నన్నావే? ఆ అభిప్రాయం నీకింకా ఉన్నదా?" అని అడిగాడు.

"నా కెప్పుడూ ఆమెను పెళ్ళాడాలనే ఉన్నది. మధ్యలో మీరే అడ్డుపుల్లలు వేశారు," అన్నాడు రఘు.

ఆ తరవాత కొద్దిరోజులకే లక్ష్మికీ రఘుకూ పెళ్లి అయింది. తానితో అందరూ సుఖంగా వున్నారు.






## 18

[పింగళుడు అవంతీనగరం చేరేసరికి, తల్లిద్వారా అక్కడ తన అన్నల దుస్థితి తెలిసింది. వెంటనే భల్లూకకేతుణ్ణి పంపి, రాజుగారి ధనాగారంలోని డబ్బు, మహత్తు గల సంచీతో పాటు, అన్నలనుకూడా తన యింటికి తెప్పించాడు. తరవాత అతడి ఆజ్ఞ కాగానే, భల్లూకకేతుడు ఒక అపూర్వ భవనం కట్టేందుకు పూనుకున్నాడు. —తరవాత]

భల్లూకకేతుడు తన అనుచరులతో చీకటి పడేసరికల్లా అవంతీనగరం తిరిగివచ్చాడు. అతడి నాయకత్వంకింద, నదీతీరంలో భవన నిర్మాణం ప్రారంభించబడింది. వందల వేల సంఖ్యలో వున్న పిశాచశిల్పులూ, కూలీలూ కలిసి, పునాదులు తవ్వి, రాళ్లు చెక్కి ఒక అపూర్వభవనం కట్టసాగారు.

నదీతీరంలో చెలరేగిన యీ కోలాహలం, అవంతీనగర కావలివాళ్లు విని, అక్కడేమి జరుగుతున్నదో చూడబోయారు. యిలా వచ్చినవారిని చాలామందిని, భల్లూకకేతుడి అనుచరులు పట్టుకుని, భవననిర్మాణపు పనిలో కూలీలుగా వుపయోగించుకున్నారు. కత్తులూ, కటార్లూ తీసుకువచ్చి ఎదురు తిరిగిన రాజభటులను మెత్తగా తన్ని తగిలేశారు.

సూర్యోదయం అయేసరికల్లా భవనం తయారయింది. పింగళుడు, తల్లినీ అన్నలనూ వెంటబెట్టుకుపోయి అందులో ప్రవేశించాడు. బాలసూర్యుని లేతకిరణకాంతిలో ఆ భవనం బంగారునీరు అద్దినట్టు తళతళలాడిపోయింది. పింగళుడు భల్లూకకేతుడి




అనుచరులలో ఓ యాభైమందినిమాత్రం తనకు కాపలావాళ్లుగా వుంచుకుని తతిమ్మా వారిని భల్లూకపర్వతాలకు పంపేశాడు. భల్లూకకేతుడు ప్రహరీగోడకు వున్న ఇనప చువ్వల తలుపులను బార్లా తెరిచి, వాటి పక్కగా ఒక పెద్ద రాతికుర్చీమీద కాపలి వాడిలా కూర్చున్నాడు.

అసరికే అవంతీనగర రాజప్రాసాదంలో కలకలం బయలుదేరింది. రాత్రి భల్లూక కేతుడి అనుచరులు కడుతున్న వింత భవనం చూడబోయి, వాళ్లవల్ల చావుదెబ్బలు తినివచ్చిన రక్షకభటనాయకు డొకడు మంత్రి దగ్గరకు వెళ్లి మొరబెట్టుకున్నాడు.

ఆ భవనం, అక్కడ పనిచేస్తున్న శిల్పులూ, కూలీలూ పిశాచాలని విన్నప్పుడు మంత్రికి మొదట యిది నమ్మదగినదిలా తోచలేదు.

"ఏమోయ్, యిది నమ్మశక్యంగా లేదు. నీవు తాగిన మత్తులో ఏవేవో పిచ్చికలలు కని వుంటావు. ఇక యింటికి పోయి విశ్రాంతి తీసుకో. రాజుగారికి తెలిస్తే నీకు కారాగారం తప్పదు," అన్నాడు మంత్రి.

"లేదు, మహామంత్రీ! ఇంకా మన భటులు కొందరు వాళ్లకు ఖైదీలుగా వున్నారు. ఆ పిశాచాలచేత చావుదెబ్బలు తిని పారిపోయి వచ్చింది నేనొక్కణ్ణే కాదు. ఇంతెందుకు, మీరు కోటబురుజు ఎక్కి చూడండి, నదీతీరాన వున్న ఆ భవనం కనబడుతుంది!" అన్నాడు రక్షకభట నాయకుడు.

మంత్రి బురుజు ఎక్కిచూశాడు. ఎదురుగా నదీతీరాన సూర్యకాంతిలో మిలమిల లాడుతున్న వింతభవనం అతడి కంట బడింది. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. "ఏమిటీ అద్భుతం!" అనుకుంటూ అతడు బురుజు దిగి వచ్చేంతలో, కోశాగారాధిపతి పెద్దగా శోకాలుపెడుతూ, "మహామంత్రీ! కొంపలంటుకున్నై. కోశాగారంలో చిల్లిగవ్వ లేకుండా దొంగిలించబడింది!" అన్నాడు.

"కోశాగారం కొల్లబోయిందా? కావలి వాళ్లేమయారు? వాళ్లను వెంటనే యిక్కడికి పిలిపించు!" అన్నాడు మంత్రి వణికిపోతూ.

"కావలివాళ్ల లోపం ఏమీలేదు, మహా మంత్రీ! కోశాగారం తలుపులు వేసినవి వేసినట్టే వున్నవి. వాటి బీగాలు చెక్కు చెదరలేదు. అంతా మాయ!" అన్నాడు కోశాగారాధిపతి ఆకాశంకేసి చూస్తూ.

"అంతా మాయ! అలాగా?" అంటూ మంత్రి, కోశాగారాధిపతికేసి నిప్పులు చెరిగే కళ్లతో చూస్తూ, "ఈ మాయకు నీ వనుభవించబోయేది వురిశిక్ష, తెలుసా? రాజుగారి దగ్గిరకు పద!" అంటూ హుంకరించాడు.

మంత్రీ, కోశాగారాధిపతీ రాజుగారి గదిని సమీపించబోయేంతలో, కారాగారాధిపతి బొబ్బలుపెడుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, "మహామంత్రీ! మహావిపత్తు జరిగి పోయింది! ఆ జీవదత్తుడూ, లక్షదత్తుడూ మాయమయారు!" అన్నాడు.

ఈ మాటలతో మంత్రికి మతిపోయినట్టయింది. అతడు కారాగారాధిపతికేసి గుడ్లురుముతూ, "ఆ జీవదత్తుడూ, లక్షదత్తుడూ దేవతలా ఏం? ఎలా మాయమయారు?" అన్నాడు గద్దిస్తూ.



"వాళ్లుండే కొట్లో ఒక గొయ్యిమాత్రం వున్నది. అంత పెద్ద గొయ్యి మానవమాత్రులెవరూ చేయలేరు. ఏ దేవతలో, రాక్షసులో చేసివుండాలి!" అన్నాడు కారాగారాధిపతి.

మంత్రి ఆలోచనలో పడ్డాడు. నదీతీరాన ఒక్క రాత్రిలో నిర్మింపబడిన భవనం, రక్షకభటనాయకుడు చెప్పే మాటలూ, రాజభవనంలో జరిగిన వింతలూ చూస్తూంటే, యిదంతా మానవమాత్రుల పనికాదని అతడికి అర్థమైంది. ఖైదు కొట్లలోనుంచి విడిపింపబడిన జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ మంత్రవేత్త అయిన పింగళు డనే ఒక తమ్ముడు వున్నాడని మంత్రి లోగడ విని



వున్నాడు. "ఈ జరిగినదంతా రాజుగారికి విన్నవించటమే మంచిది. మంత్రవేత్త అయిన పింగళుడు యీ నగరానికి తిరిగి వచ్చివుండాలి!" అన్నాడు మంత్రి.

కాని, రాజుగారి గదిని సమీపించేసరికి, అక్కడా కల్లోలంగానే వున్నది. "నిజం చెప్పండి! మిమ్మల్నందర్నీ కొరతవేయించు తాను. నా అద్భుతాల సంచీ ఎక్కడ?" అంటున్నాడు రాజుగారు. ఆయనకెదురుగా, రాజుగారి వంటగదిలో పనిచేసే నౌకర్లంతా చేతులు కట్టుకుని నిలబడి వున్నారు.

మంత్రి రావటం చూస్తూనే, రాజుగారు అతడికేసి తిరిగి, "మంత్రీ, వీళ్లనందరినీ కట్టకట్టి ఏనుగులచేత తొక్కించు. దుర్మార్గులు! నా మహత్తు గల సంచీని దొంగిలించారు!" అన్నాడు వుద్రేకంగా.

"మహారాజా! యింకా చాలా ఘోరాలు జరిగిపోయినై," అంటూ మంత్రి అన్ని సంగతులూ రాజుగారికి నివేదించాడు. అంతా విని రాజు మండిపోతూ, "వెంటనే ప్రాసాదరక్షకుణ్ణి పిలిచి, యాభైమంది భటులను వెంటబెట్టుకుపోయి, ఆ భవనంలో వున్నవారందరినీ పెడరెక్కలు విరిచికట్టి యిక్కడికి లాక్కు రమ్మను!" అని అజ్ఞాపించాడు.

"మహారాజా, సావధానంగా ఆలోచించండి!" అంటూ మంత్రి యింకా ఏమో చెప్పబోయేంతలో, రాజు కస్సుమని లేచి, "నువ్వు ఆ జాలరివాడికి రాజ్యం కట్టబెట్టి, మంత్రిత్వం వెలిగిద్దామని చూస్తున్నావా ఏం?" అన్నాడు తీవ్రంగా.

మంత్రి మారు మాటాడలేకపోయాడు. అప్పుడే అక్కడికి వచ్చిన రాజప్రాసాద రక్షకుడు రాజుతో, "మహారాజా! ఆ పింగళుణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకురమ్మనిసెలవా?" అని అడిగాడు.

"వాణ్ణి గుర్రానికి కట్టి యీడ్చుకు వచ్చినా, గాడిదకు కట్టి యీడ్చుకు వచ్చినా





నాకొకటే. నాకు కావలసింది మహత్తు గల సంచీ, ధనాగారంనుంచి వాడు దోచుకు పోయిన డబ్బూ! తెలిసిందా? యిక పో," అన్నాడు రాజు కోపంగా.

ప్రాసాదరక్షకుడు సాయుధులైన యాభై మంది భటులను తీసుకుని పింగళుడి భవ నాన్ని సమీపించాడు. ప్రహరీద్వారం దగ్గిర పెద్ద రాతికుర్చీలో కూర్చుని, నీరెండలో జోగు తూన్న భల్లూకకేతుణ్ణి చూస్తూనే భటులు అదిరిపడి, "అయ్యో! వీడెవడో రాక్షసుడిలా వున్నాడు. ఆ ఏనుగుచెవులు చూడండి! అడవిపంది కోరల్లా వున్న వాడి దంతాలు చిత్తగించండి!" అన్నారు వెనకడుగు వేస్తూ.

ప్రాసాదరక్షకుడు పకపకమంటూ నవ్వి, "ఓరి అమాయకుల్లారా, భయపడకండి! వీడెవడో మనను భయపెట్టేందుకు, పగటి వేషగాడిలా అవన్నీ తగిలించుకున్నాడు!" అంటూ గుర్రాన్ని అదిలించి, భల్లూకకేతుణ్ణి సమీపించి, తన చేతగల యీటెతో అతడి భుజాన్ని పొడుస్తూ, "అరే పొగరుబోతూ, కళ్ళు తెరు! రాజప్రాసాదరక్షకుడు ఏతెంచాడు!" అన్నాడు కోపంగా.

భల్లూకకేతుడు కళ్ళు తెరుస్తూనే తన భుజానికి అనివున్న యీటెను ఒక చేత్తో గుంజుకుని, దానిని తిరగవేసి, ప్రాసాద రక్షకుణ్ణి డొక్కలో రెండు పోట్లు పొడిచి, కుయ్యోమంటున్న అతగాడి రెండు కాళ్ళూ పట్టుకుని గిరగిరా తిప్పి, దూరంగా నదిలో విసరివేశాడు.

ఈ దృశ్యం చూస్తూనే తతిమ్మా రాజ భటులు, 'అయ్యో, బాబో!' అని అరుస్తూ అక్కడినించి పిక్కబలంకొొందికీ పారిపో సాగారు. భల్లూకకేతుడు వారికేసి ఓ తృటి కాలం చూసి చిరునవ్వు నవ్వి తిరిగి తన రాతికుర్చీలో కూర్చుని తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు.

పారిపోయిన భటులు హాహాకారాలు చేస్తూ రాజుగారిదగ్గిరకు వెళ్లి జరిగిన సంగతి






చెప్పారు. అది విన్న రాజుకు అగ్రహం ముంచుకు వచ్చింది. "ఓరి చవటల్లారా! ఒక్క అడివిజాతి మనిషిని పట్టుకురావటం మీవల్ల కాలేదన్న మాట, ఛీ!" అన్నాడు ఆయన. వెంటనే మంత్రి ముందుకు వచ్చి, "మహారాజా! తొందరపడకండి! వాడు అడివిజాతి మనిషో లేక రాక్షసుడో మనకు తెలియదు. ఆ జాలరి పింగళుడు మంత్ర వేత్త అని మీకు తెలియంది కాదుగదా?" అన్నాడు వినయంగా.

"వాడెంత మంత్రవేత్త అయితేమాత్రం—ఆ జాలరి, అవంతీనగర రాజునే ధిక్కరిస్తాడా? వాడి తల నరికించి కోటకొమ్ముకు



కట్టిస్తాను!" అంటూ, "సేనానీ, సేనానీ!" అని చప్పట్లు చరిచాడు రాజు.

"మహారాజా!" అంటూ సేనానాయకుడు ముందుకు వచ్చాడు. పింగళుడు కట్టిన భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికిన వారి నందరినీ బంధించి తేవలసిందిగా రాజు అతడికి ఆజ్ఞ యిచ్చాడు.

సేనానాయకుడి ఉత్సాహానికి అంతు లేదు. యీమధ్య కొన్ని సంవత్సరాలుగా యుద్ధాలు లేకపోవడంతో అతడికి మతి పోయినట్టుగా వున్నది. యీ దెబ్బతో నదీ తీరంలో వున్న భవనాన్ని నేలమట్టం చేసి, అక్కడ దొరికినవారినందరినీ మనసారా చిత్రహింస చేయవచ్చుననుకున్నాడు. "ఈ పింగళు డనేవాడికి చిన్న సైన్యం వుంటే ఎంత బాగుండును! బాహాబాహి ముష్టాముష్టి భీకర భయంకర ఘోర సంగ్రామం చేద్దునే!" అనుకున్నాడతడు.

రెండువందలమంది అశ్వికులూ, మూడు వందలమంది కాలిభటులూ వెంట రాగా సేనానాయకుడు ఎంతో పటాటోపంతో బయలుదేరి పింగళుడి భవనాన్ని సమీపించాడు. భల్లూకకేతుడు నిద్రపోతున్నట్టు నటిస్తూనే, ఒక కన్ను సగం తెరిచి సేనానాయకుడి రాకను గమనిస్తున్నాడు. సేనా





నాయకుడు ప్రహరీగోడ ద్వారాన్ని సమీపించి, చేతనున్న యీటెను, భల్లూకకేతుడికేసి గురిపెట్టి, "ఏయ్, అడివిమనిషీ! మీ యజమాని ఎక్కడ? లే, లేచి నిలబడు!" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

భల్లూకకేతుడు అప్పుడే మెలుకువ వచ్చినవాడిలా, ఒళ్ళు విరుచుకుంటూ లేచి నిలబడి సేనానాయకుడికేసి దృష్టి సారించి, "ఎవడురా పిలిచిన మానవాధముడు, నువ్వేనా?" అన్నాడు కోపంగా.

ఆ ప్రశ్నతో సేనానాయకుడు నిలువెల్లా భగ్గుమన్నాడు. అతడు యీటెను భల్లూకకేతుడి గుండెలకు బారుచేసి, గుర్రాన్ని ముందుకు దూకించాడు. భల్లూకకేతుడు తీరా యీటెమొన గుండెల్ని తాకబోయే సమయానికి పక్కకు అడుగు వేసి, గుర్రం మీద వున్న సేనానాయకుణ్ణి రెండు చేతులతోనూ వొడిసి పట్టుకుని, రాతికుర్చీలో పడవేసి పైనకూర్చుంటూ, చప్పట్లుచరిచాడు.

వెంటనే బిలబిలమంటూ అతడి అనుచరులు వివిధ రకాల రాతిఆయుధాలతో అక్కడికి పరిగెత్తుకువచ్చారు. వారికి పారిపోజూస్తున్న రాజభటులను చూపిస్తూ, "ఈ పొగరుబోతులను దూదికింద ఏకి తాళ్ళు పేనండి!" అన్నాడు భల్లూకకేతుడు.




భల్లూకకేతుడి అనుచరులు రాజుగారి అశ్వికులమీదా, కాలిభటులమీదా పడి తమ చేత గల రాతిఆయుధాలతో వాళ్ళను గొడ్లను బాదినట్టు బాదసాగారు. ఈ దృశ్యాన్ని చూసి భవనంలోని రెండో అంతస్తులో వున్న పింగళుడూ, తల్లీ, అన్నలూ పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.

బతికి బయటపడిన కొద్దిమంది రాజభటులు కోటలోకి పరిగెత్తి, గోడుగోడుమంటూ జరిగినదంతా రాజుగారికి చెప్పారు. ఆ సరికి రాజుగారికి పింగళుడు మామూలు జాలరికాదని అర్థమైపోయింది. ఆయన కోపాన్ని తొక్కిపట్టుకుంటూ లేచి, తన



మంత్రితో, "మంత్రీ! ఇది చాలా అవమాన కరం అయిన సంగతి. చావో బ్రతుకో నేనే స్వయంగా సైన్యాన్ని నడిపి ఆ పింగళుడితో పోరాడుతాను. నేను ఒకవేళ యుద్ధంలో మరణించటమే జరిగితే...నా ఒక్కగానొక్క కుమార్తె వకుళను నువ్వే అన్నివిధాలా కాపాడి, ఆమెకు తగిన వరుణ్ణి చూసి వివాహం జరిపించాలి," అన్నాడు.

మంత్రి ఓ క్షణకాలం ఆలోచించి, "మహారాజా! తమరు ఆగ్రహించక నే చెప్ప బోయేదాన్ని శాంతంగా వినాలని కోరు తున్నాను," అన్నాడు.

"ఏమిటదీ?" అన్నాడు రాజు.

"పింగళుడు యువకుడు, అవివాహి తుడు. అతన్ని ఎరిగివున్న వారిద్వారా నాకు తెలిసినదేమిటంటే, అందచందాలలో ఏ రాజకుమారుడూ అతడికి సరిరాడని. ఐశ్వ ర్యంలో, శౌర్య సాహసాల్లోకూడా అతడికి అతడే సాటి. రాజకుమార్తెతో అతడికి వివాహం జరిపించటంద్వారా, మీకూ రాజ్యా నిక్కూడా పెద్ద ఉపద్రవం తప్పుతుంది!" అన్నాడు మంత్రి.

రాజు కొంచెంసేపు ఆలోచించి, "ఇది నాకు సమ్మతమే, మంత్రీ!" అన్నాడు సంతోషంగా.

మంత్రి సర్వలాంఛనాలతో వెళ్లి పింగ ళుడినీ, తల్లినీ కలుసుకుని రాజుగారి కోర్కె గురించి చెప్పాడు. రాజకుమార్తె సౌంద ర్యాన్నిగురించి లోగడే వినివున్న పింగళుడు వివాహానికి అంగీకరించాడు.

తరవాత కొద్దిరోజులకే రాజకుమార్తె వకు ళకూ పింగళుడికీ వైభవంగా వివాహం జరి గింది. మహామాంత్రికుడైన పద్మపాదుడు వివాహానికి వచ్చి వధూవరులను ఆశీర్వ దించాడు. కొంతకాలానికి రాజు మరణిం చగా, పింగళుడే అవంతీనగరానికి రాజై, చాలా సంవత్సరాలు ప్రజలకు యిష్టుడుగా రాజ్యపాలనచేశాడు. —(అయిపోయింది)



# పలకని దేవుడు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, మరొకమారు మౌనంగా శ్మశానానికేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనిషికి అన్నిటికన్న ముఖ్యమైనది విశ్వాసం. ఎటువంటి పరిస్థితిలోనూ మనిషి తన విశ్వాసాన్ని కోల్పోరాదు. పూర్వం సత్యపాలుడనే యువకుడు విశ్వాసాన్ని కోల్పోయి ఎంత పొరపాటు చేశాడో చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం భద్రావతీనగరంలో ఒక రామాలయం ఉండేది. ఆ ఆలయంలో గల శ్రీరాముడు అపూర్వమైన మహిమలు గల దేవుడు. ఆయన తన పూజారిద్వారా భక్తుల సందేహాలను తీర్చేవాడు; వారికి కలగబోయే కష్టాలను తొలగించేవాడు. ఒక్కొక్కసారి దేవుడి కంఠం స్వయంగా మాట్లాడేది.

## బేతాళ కథలు



అలా జరిగినప్పుడు ఆలయంలో ఉన్నవారు భక్తితన్మయత్వంలో మునిగి పరవశులై పోయేవారు.

ఈ ఆలయానికి అంజనేయస్వామి అనే ఆయన పూజారిగా ఉండేవాడు. ఆయనను ప్రజలు హనుమంతుడి అపరావతారంగా భావించి పూజించేవారు.

భద్రావతీ రామాలయం పేరుప్రతిష్ఠలు దేశదేశాలా వ్యాపించుటంవల్ల ఎక్కడెక్కడి నుంచో ప్రజలు స్వామిని దర్శనంచేసుకునేటందుకు వచ్చేవారు. ఈ యాత్రికుల మూలంగా భద్రావతీ నగరంకూడా అర్థికంగా బాగుపడి ఒక మహానగరమయింది.

ఇలా ఉండగా పూజారి అయిన అంజనేయస్వామికి జబ్బుచేసి కొద్ది రోజులకు శ్రీరామచంద్రమూర్తిలో ఐక్యమయాడు. ఆలయానికి మరొక పూజారిని ఏర్పాటు చేయవలిసి వచ్చింది. ఇందుకుగాను సత్యపాలుడనే యువకుణ్ణి నియమించారు.

సత్యపాలుడు పసితనంనుంచికూడా గొప్ప రామభక్తుడు. అతనికి రామనామ సంకీర్తన తప్ప మరొక యావ లేదు. అదీగాక అతనికి అర్చనచేసే పద్ధతి అంతా తెలుసు. అందుచేత సత్యపాలుడు రామాలయానికి అర్చకుడు కావటం అందరికీ నచ్చింది.

అయితే ఒక పెద్ద ప్రమాదం జరిగింది. సత్యపాలుడు అర్చకుడైనది మొదలు స్వామివారు మౌనందాల్చారు. ఎప్పటిలాగా భక్తులు వచ్చి దేవుణ్ణి రకరకాల ప్రశ్నలు అడుగుతూనే ఉన్నారు; కాని వారికి ఏయే సమాధానాలు చెప్పాలో స్వామివారు తన అర్చకుడికి చెప్పలేదు; స్వామివారి కంఠం వినిపించటమనేది మొదలే లేకుండా పోయింది.

ఈ మార్పు చూసి సత్యపాలుడు చాలా ఆవేదనపడ్డాడు. "స్వామీ, నా వల్ల ఏమి అపచారం జరిగింది? నువ్వెందుకు పలకవు? మౌనం వహించకపోతే, నన్ను శిక్షించ

రాదా ?" అని అతను దేవుణ్ణి ఎన్నో విధాల వేడుకున్నాడు. అప్పటికీ శ్రీరామచంద్ర మూర్తి పలకలేదు.

సత్యపాలుడు నగరంలోని పెద్దలతో, "ఇంత మహిమగల దేవుడు మౌనం వహించాడంటే తప్పు నాలోనే ఉండి ఉండాలి !" అన్నాడు.

"అవును, నాయనా, తప్పు నీదే అయి ఉండాలి. దాన్ని ఎలాగైనా సరిచేసుకుని స్వామివారి దయ సంపాదించుకో. లేకపోతే మన ఆలయానికి గల ప్రతిష్ఠ కాస్తా పోతుంది. యాత్రికులు రావటం మానేస్తారు. మన నగరానికే అరిష్టం చుట్టుకుంటుంది !" అన్నారు పెద్దలు.

సత్యపాలుడికి మతిపోయినట్టయింది. అతను ఆలయానికి తిరిగి వెళ్లి వెర్రివాడి లాగా గుడివాకిట కూచుని ఏదో ఆలోచించ సాగాడు. అప్పుడే గుడికి వచ్చేవారి సంఖ్య తగ్గిపోతున్నది.

మధ్యాహ్నం వేళకు గుడి నిర్మానుష్య మయింది. ఎవరో వస్తున్న అలికిడి విని సత్యపాలుడు తల ఎత్తి ఒక ముసలిదాన్ని చూశాడు. ఆ ముసలిదాన్ని అతను ఎరుగును. ఆమె ఒక భక్తురాలు. తరుచు ఆలయం ఆవరణలో కనబడుతూ




ఉంటుంది. అప్పుడప్పుడూ చీపురుతో ఆవరణ చిమ్ముతుంది, చెట్లకు నీళ్లు పోస్తుంది.

ఆ ముసలిది సత్యపాలుణ్ణి సమీపించి, "ఏం, నాయనా, స్వామి పలకటంలేదా ?" అని అడిగింది.

"లేదు, తల్లీ ! ఏం చెయ్యాలో నాకు పాలుపోవటం లేదు !" అన్నాడు సత్యపాలుడు నిట్టూర్చి.

"దిబ్బెంలో నుంచి ఒక వంద రూపాయలు తీసి ఇచ్చావంటే దేవుడు పలికే మార్గం చెబుతాను !" అన్నది ముసలిది.

ఈ మాటలు విని సత్యపాలుడు మండిపడి, "ఛీ, ముసలి తొత్తా ! నువ్వేమో భక్తు

రాలివసుకున్నాను! లంచం తీసుకుని భగవంతుడి అనుగ్రహం సంపాదిస్తావా? పో అవతలికి!" అని కసిరాడు.

ముసలిది ఆగ్రహించకుండానే వెళ్లిపోయింది. ఆ మర్నాడు అదే వేళకు ఆమె మళ్లీ సత్యపాలుడి వద్దకు వచ్చి, "రెండు వందల రూపాయలు ఇచ్చెయ్యి! స్వామి పలికే దారి చెబుతాను. నిష్కారణంగా చెడిపోకు!" అన్నది.

సత్యపాలుడు ఆమెను మళ్లీ తిట్టి పంపాడు. కాని తరవాత అతనికి ఒక విధమైన అనుమానం పట్టుకున్నది. భగవంతుడు తనను ఈ విధంగా పరీక్షిస్తున్నాడేమో! ఈ ముసలిదానికి లంచం ఇవ్వటం స్వామి దృష్టిలో తప్పు కాదేమో!

ఈ అనుమానం మనసులో పడటంవల్ల మూడోనాడు ముసలిది రాగానే, "అవ్వా, నువు కోరినది ఇస్తాను. స్వామివారు పలికే మార్గం చెప్పు!" అని ప్రాధేయపడి అడిగాడు.

"దిబ్బెంలోనుంచి మూడువందల రూపాయలు తీసి ఇయ్యి," అన్నది ముసలిది. సత్యపాలుడు అలాగే చేసి, "ఏం చెయ్యాలో చెప్పు!" అన్నాడు.

"మూర్ఖుడా, నీకు గడ్డాలూ మీసాలు రానట్టే బుద్ధికూడా పెరగలేదు. ఇంత



కాలమూ పలికినది ఎవరనుకున్నావు? నేనే! నేనూ అంజనేయస్వామీ కలిసి భక్తులకు కావలిసినవన్నీ చెప్పాం! విగ్రహం వెనక భూమిలో ఒక చిన్న మాళిగ ఉన్నది. అందులో నేను దాక్కుని మాట్లాడుతూ ఉంటాను. నన్ను కనిపెట్టి ఉన్నావంటే నీకుకూడా సహాయం చేస్తాను!" అన్నది ముసలిది.

సత్యపాలుడి హృదయం నీరు కారిపోయినట్టయింది. "నీతో నాకు పనిలేదు, వెళ్లు!" అని ముసలిదాన్ని పంపేసి, సత్యపాలుడు అప్పటికప్పుడే గుడినుంచి బయటికి వచ్చేసి, ఎటో వెళ్లిపోయాడు. ముసలిది చెప్పిన మాటలతో అతనికి రాముడి మహిమలోనూ, ప్రజలను వంచించే పూజారులలోనూ, అలయాలలోనూ పూర్తిగా నమ్మకం పోయింది.

అతను భద్రావతీనగరంలో ఎవరితోనూ చెప్పకుండా వెళ్లిపోయి దేశదేశాలూ తిరిగాడు. ముష్టిఎత్తీ, కూలిపని చేసీ ఏదో విధంగా పొట్టపోసుకుంటూ అనేక నెలలపాటు దేశసంచారం చేశాడు. అయితే భద్రావతి వదిలాక అతను ఒక్క గుడిలోకూడా అడుగుపెట్టలేదు, ఒక్కసారికూడా దేవుణ్ణి స్మరించలేదు.

రెండేళ్లు గడిచింది. ఒకనాడు చీకటిపడి సత్యపాలుడు ఒక గ్రామంలో ఉన్న సత్రా






నికి చేరాడు. అతను సత్రం అరుగుమీద చేరి విశ్రాంతి తీసుకుంటుండగా, సమీపంలో కొందరు మనుషులు భద్రావతీ రామచంద్ర మూర్తి మహిమను కొనియాడుతూ ఉండటం అతని చెవుల పడింది.

అతను ఆశ్చర్యంతో వారిని సమీపించి, "అయ్యా, భద్రావతీ రామచంద్రమూర్తి నిజంగా మహిమగల దేవుడేనా?" అని అడిగాడు.

"అలా అడుగుతావేం; నాయనా? భద్రావతీ రాముడి మహిమ తెలియని మనుషులు కూడా ఉన్నారా? మరీ కొత్తపూజారి వచ్చాక స్వామి మహిమ చెప్పతరం కాకుండా ఉన్నది. అతను వచ్చిన కొత్త లోనే, ఆ ఆలయంలో ఉండే ముసలిది గొంతుకు రూపాయి అడ్డంపడి చనిపోతుం దని దేవుడు పలికాడు. అక్షరాలా అలాగే జరిగింది!" అన్నాడు మాట్లాడేవారిలో ఒక బాటసారి.

"అయితే ఇప్పుడా ఆలయానికి పూజారి ఎవరండీ?" అని సత్యపాలుడు బాటసారు లను అడిగాడు.

"చాలా చిన్నవాడు. పేరు సత్యపాలు డుట! అతని ముఖాన ఏమి తేజస్సు!" అన్నారు బాటసారులు.

"సత్యపాలుడా? నా పేరూ సత్య పాలుడే!" అన్నాడు సత్యపాలుడు.

మసకచీకటిలో బాటసారులు సత్య పాలుణ్ణి పరకాయించి చూసి, "ఆశ్చర్యం! ఆ మనిషి పేరు పెట్టుకోవటమే గాక మనిషివి కూడా అచ్చగా ఆ అర్చకుణ్ణి పోలి ఉన్నావే!" అన్నారు.

తాను ఆలయాన్ని వదలి వచ్చేశాక తన పేరు గలవాడే, తనలాటివాడే అర్చకుడుగా ఉండటమూ, దేవుడు పలుకుతూ ఉండ టమూ తెలుసుకుని సత్యపాలుడు, "ఇందులో గొప్ప మోసమో, గొప్ప మహిమో ఉండాలి!" అనుకున్నాడు.

మర్నాడే బయలుదేరి అతను భద్రావతికి వెళ్లి నేరుగా రామాలయం చేరుకున్నాడు. ఆలయం దగ్గిర జనం ఇసకవేస్తే రాలటం లేదు. వారిని తోసుకుంటూ సత్యపాలుడు ఆలయం లోపలికి వెళ్లాడు. అతన్ని చూసిన వాళ్లు, "అర్చకుడికి దారి ఇవ్వండి!" అని అరిచారు.

ఆలయంలో అచ్చుగా తనను పోలిన మనిషే అర్చకుడుగా పని చేస్తూండటం సత్యపాలుడి కంటపడింది. అంతేకాక, ఆ అర్చకుడు తనను దగ్గిరికి రమ్మని పిలిచినట్టు వినపడింది. సత్యపాలుడు అర్చకుణ్ణి సమీపించాడు.

"ఎవరో వంచకురాలు నా పేర ప్రజలను మోసం చేసిందని విని, నాలో విశ్వాసం లేకుండా వెళ్లిపోవటం భావ్యమేనా, నాయనా? చూడు, నీవు లేనందున నీ పని యాపత్తూ నేను చెయ్యవలిసి వచ్చింది!" అన్నాడు అర్చకుడు.

తనతో మాట్లాడుతున్నది శ్రీరామచంద్రుడేనని సత్యపాలుడు గ్రహించాడు. "నా అపచారం మన్నించు, స్వామీ! ఇక విడవకుండా నీ సేవ చేస్తాను!" అన్నాడతను పూజారితో.

"నాకు నీ సేవ అవసరంలేదు నాయనా! నాలో విశ్వాసం ఉంచి ప్రజలసేవ చెయ్యి!"



అంటూ పూజారి ఒక్కసారి దేదీప్యమానంగా వెలిగి అంతర్ధానమైనాడు. సత్యపాలుడు తిరిగి ప్రపంచంలోకి వెళ్లిపోయాడు. ఆ తర వాత ఆ ఆలయంలో దేవుడి గొంతు విన్న వారు లేరు. క్రమంగా ఆ ఆలయాన్ని గురించి ప్రజలు చెప్పుకోవటంకూడా మానే శారు. కాలక్రమాన భద్రావతీ రామాలయం శిథిలమైపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం: సత్యపాలుడు తనకు పూజారిగా పనిచెయ్యటానికి శ్రీరామచంద్రుడు ఎందుకు ఒప్పలేదు? అతను తనయందు విశ్వాసం లేకుండా వెళ్లిపోయాడన్న కోపంచేతనా? భద్రావతీ రామాలయం మహిమలు కోల్పోవటానికి కారకుడు సత్యపాలుడా? లేక ఆ ఆలయంలో అర్చన పొందిన శ్రీరాముడా? ఈ సందేహాలకు సమా ధానాలు తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సత్యపాలుడికి తనయందు విశ్వాసం పోయిందని శ్రీరాముడు అతనిపై ఆగ్రహించిన మాట అబద్ధం. ఆగ్ర హించినవాడైతే అతని రూపంలో అర్చ కుడుగా పనిచేసి అంతకాలం మహిమ ప్రదర్శించి ఉండడు. సత్యపాలుడికి తనలో తిరిగి విశ్వాసం కలగగలందులకే శ్రీరాముడు ఆ ఆలయంలో మహిమలు ప్రదర్శించాడు. అంతకు పూర్వం ఆ ఆలయంలో కనబడిన మహిమలన్నీ మోసంతో కూడుకున్నవే. భగ వంతుడు నిజమైన మహిమలు ప్రదర్శించి నది కేవలం తన భక్తుడైన సత్యపాలుడి కోసం మాత్రమే. అందుచేత ఆ ఆలయం వున్నట్టుండి మహిమలు కోల్పోవటం సత్య పాలుడి తప్పూ కాదు, శ్రీరాముడి తప్పూ కాదు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# 10

[ రాజకుమార్తె అజ్ఞానంవల్ల అద్భుతదీపాన్ని కోల్పోయిన అలాదీన్ తన ఉంగరంలోని భూతం సహాయంతో, మొరాకోలో ఉన్న తన భార్యను చేరుకుని, మాయోపాయంచేత మాంత్రికుణ్ణి హతమార్చి, తన భార్యనూ, భవనాన్నీ తెచ్చుకుని, తిరిగి రాజుగారి మన్నన లకు పాత్రుడై సుఖంగా ఉంటున్నాడు. అతని కష్టాలన్నీ గట్టెక్కినట్టే కనపడ్డాయి. కాని—]

కొద్దిమాసాలు గడిచాయి. ఒక పేద దర్జీ వాడి కొడుకుగా జీవితం ప్రారంభించిన అలాదీన్ మహారాజులకుకూడా లేని వైభో గాలతో తులతూగుతూ, తన భార్యతోనూ, తల్లితోనూ సుఖంగా కాలం గడుపుతున్నాడు.

ఒకనాడతను తన భవనంలోని స్ఫటిక శాల గవాక్షంవద్ద నిలబడి తోటను చూస్తూన్నసమయంలో అతని భార్య వచ్చి అతని చెంత నిలబడి, "భగవంతుడి అను గ్రహంవల్ల మనకే లోటూ లేదుగాని, మనకు పిల్లలు కలిగే జాడలేమీ లేకపోవటం నన్ను బాధిస్తున్నది. ఈ నగరానికి ఫత్మా అనే ఒక యోగిని వచ్చివున్నదట. అమె తాకితే ఎంతటి గొడ్రాళ్లకూ పిల్లలు పుడుతారట. అమెను ఒకసారి మన ఇంటికి పిలి పిస్తామా ?" అని అడిగింది.

అలాదీన్ ఇందుకు సమ్మతించటమేగాక, ఆ యోగినిని తన ఇంటికి తీసుకురావటానికి నలుగురు బానిసలనుకూడా పంపాడు. యోగిని వచ్చింది. అమె ముఖం కప్పుకుని



మానాలిస్తాను. ఇలాంటి వాటితో మీకు ఏమీ నిమిత్తం లేదని నేనెరుగుదును. నేనిచ్చే బహుమానాలు ఒకవేళ మీకు పనికిరాకపోతే మీ ఆదరానికి పాత్రులైన పేదసాదల కివ్వ వచ్చు," అన్నది.

రాజకుమార్తె ఈ విధంగా మాట్లాడు తుంటే యోగిని కళ్లలోకి ఒక వికృతమైన కాంతి వచ్చింది. ఆమె ముఖం జేవురించింది. ఆమె శరీరంలో ఏదో ఒక ఆనందం ఉబికివస్తున్నట్టుగా కనబడింది. ఆమె నోరు విప్పి ఏమీ అనకుండా, తన చేతులను రాజకుమార్తె నెత్తినపెట్టి, ప్రార్థన చేస్తున్నదాని లాగా గొణిగింది. ఆతరవాత ఆమె, "రాజకుమారీ, భగవంతుడి దయవల్ల నీవు పిల్లల తల్లివి కావటానికి ఒక ఉపాయం తోచింది గాని, దాన్ని ఆచరించటం నీకు అసంభవ మనుకుంటాను," అన్నది.

రాజకుమార్తె యోగిని కాళ్లపైబడి, "తల్లీ, నాభర్త అయిన అలాదీన్‌కు అసాధ్య మంటూ ఏమీలేదు. నేను ఏంచెయ్యాలో చెప్పండి. లేకపోతే మీ పాదాలదగ్గిరే నా ప్రాణాలు కాస్తా పోతాయి" అన్నది.

యోగిని ఒకవేలు ఎత్తిపట్టి, "అమ్మాయీ, నీకు పిల్లలు కలగాలంటే అందుకు ఒకటే మార్గం వున్నది. కాకసస్ పర్వతశిఖరాలలో

వున్నది. ఆమె మెడలో మూడుపేటల రుద్రాక్షమాలలున్నాయి.

రాజకుమార్తె యోగినికి ఎదురువెళ్లి నమస్కారం చేసింది. యోగిని ఆమెను ఆశీర్వదించింది. రాజకుమార్తె ఆమెను సగౌరవంగా కూచోబెట్టి, "అమ్మా, మీ ఆశీర్వాదం ఊరికే పోదు. ఎందుకంటే మీ వంటి భక్తుల మాటలు భగవంతుడు ఆలకిస్తాడు. నాకొక్క చిన్న కోరిక వున్నది. నాకు పిల్లలు కావాలి. అందుకోసం నేనేం చెయ్యాలో సెలవియ్యండి. ఏమిచెయ్యటానికైనా నేను సిద్ధంగానే వున్నాను. నాకీ ఉపకారం చేశారంటే మీకు ఎన్నో బహు

వుండే గండభేరుండ పక్షియొక్క గుడ్డును తెచ్చి మీ బురుజులో వేలగట్టించు. దాని కేసి రోజూ చూస్తూవచ్చావంటే నీకు తప్పక గర్భం నిలిచి పిల్లలు కలుగుతారు. ఇదే నా సలహా!" అన్నది.

"తల్లీ, నాకు గండభేరుండపక్షి ఏమిటో, దాని గుడ్డేమిటో తెలియదు. కాని అటు వంటిది ప్రపంచంలో ఎక్కడ వున్నా దాన్ని నా భర్త తప్పక తీసుకురాగలడని నా నమ్మకం. ఆయన ఎన్నో అద్భుతాలు చేయ గలడు," అన్నది రాజకుమార్తె.

యోగిని వెళ్ళిపోవటానికి లేచింది. ఆ పూటకు తన ఆతిథ్యం స్వీకరించమని రాజ కుమార్తె ఆమెను ప్రాధేయపడింది. కాని యోగిని వినక, "ఇంకా ఎందరో అభాగ్యులు నాకోసం వేచివున్నారు. వారి కోరికలు నెర వేర్చాలి, వారి కష్టాలు తొలగించాలి. కాని దైవానుగ్రహం వుంటే రేపు మళ్లీ కనిపించి నీ క్షేమసమాచారాలు తెలుసుకుంటాను!" అని తొందరగా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన కొంతసేపటికి అలా దీన్ తిరిగివచ్చి తన భార్యముఖాన విచార చ్ఛాయ లుండటం గమనించి, "ఏం జరిగింది? ఎందుకు అలా విచారంగా వున్నావు?" అని ఆత్రంగా అడిగాడు.



"కాకసస్ పర్వతాలమీదినుంచి గండ భేరుండపక్షి గుడ్డు వెంటనే తెప్పించండి. లేకపోతే నా ప్రాణాలు నిలవవు," అన్నది రాజకుమార్తె.

అలాదీన్ నవ్వుతూ, "వెర్రిదానా, నీ ప్రాణాలు అంత సులువుగా నిలిచేటట్టయితే నువు ఆదుర్దాపడవలిసిన అవసరంలేదు. ఆ గుడ్డు ఇప్పుడే తెప్పిస్తాను. కాని దానితో ఏంచెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"దాన్ని మన బురుజులోపల వేళ్లాడ గట్టి రోజూ దానికేసి చూస్తూండమని యోగిని చెప్పింది. అలా చేస్తే పిల్లలు పుడతారట," అన్నది రాజకుమార్తె.

"సరే, దాన్ని ఇప్పుడే తెప్పిస్తాను!" అన్నాడు అలాదీన్.

అతను తన గదిలోకి వెళ్ళి అద్భుతదీపాన్ని పైకితీసి, రుద్దాడు. భూతం ప్రత్యక్షమై, "ఏమిసెలవు?" అన్నది.

"కాకసస్‌పర్వత శిఖరాలపైన వుండే గండభేరుండపక్షి గుడ్డు వెంటనే కావాలి, తీసుకురా!" అన్నాడు అలాదీన్.

ఈ మాటలు అలాదీన్ నోటినుంచి వెలువడ్డాయో లేదో, దీపంభూతం శివం ఎత్తినట్టు కంపించిపోతూ, భవనమంతా దద్దరిల్లేటట్టుగా ఒక పెద్ద బొబ్బపెట్టి, "మూర్ఖుడా! పరమనీచుడా! ఏమిటి నువ్వనేది? మా భూతాలకు రాజైన గండభేరుండ పక్షి సంతానాన్ని తీసుకురమ్మంటావురా? ఉంగరం రక్షిస్తూ వుండకపోతే ఈపాటికి నిన్ను భస్మీపటలం చేసివుందును," అని అరిచింది.

అలాదీన్ కంగారుపడ్డాడు. "భూతమా, నాపైన ఆగ్రహించకు. నిన్నీపని చెయ్యమన్నది నాకోసం కాదు, నా భార్యకోసం. ఒక గొప్ప సిద్ధురాలు చెప్పగా నా భార్య సంతానాభిలాషతో ఈ కోరిక కోరింది. అందుచేత మాపై ఆగ్రహించకు," అన్నాడు.

వెంటనే భూతం శాంతించి, "ఓ అలాదీన్, ఇది నీ కోరిక కాకపోవటం మంచి



దయింది. ఈ ఆలోచన మరొక నీచుడిది. లేకపోయినట్టయితే నువ్వూ, నీ భార్యా, నీ భవనమూ సర్వనాశనమై ఉండవలిసిందే. నువు సిద్ధురాలని చెప్పే మనిషి మరెవరో కాదు, మొరాకో మాంత్రికుడి తమ్ముడు. చూడటానికి మూడు మూర్తులా అన్నలాగే ఉంటాడు. దుర్మార్గంలో అన్నకు ఏమీ తీసిపోడు. తన అన్న నీ చేతిలో చచ్చాడని తెలిసి, నీపై పగ తీర్చుకునేటందుకు వాడు మొరాకో నుంచి వచ్చి, ఈ ఎత్తు వేశాడు. ఈ రహస్యం నీకు చెప్పేశాను గనక నువు వాడి విషయంలో సావధానుడవై ఉండు!" అని చెప్పి, అంతర్ధానమయింది.

అలాదీన్ మండిపడ్డాడు. అతను తన భార్య వద్దకు తిరిగివెళ్లి, "గండభేరుండపక్షి గుడ్డును తెప్పించేలోపుగా ఆ యోగిని చెప్పే దేమిటో నేను స్వయంగా వినటం చాలా అవసరం. అందుచేత ఆమెను ఇంకొకసారి పిలిపిస్తావా? ఆమె వచ్చేసరికి నేను తెరల వెనక దాగి ఉంటాను. ఆ గుడ్డుతో ఏం చెయ్యాలో మరొకసారి ఆమెచేత చెప్పించు. అవిడ మొదట చెప్పిన విషయాలు మరిచి పోయానని చెప్పు," అన్నాడు.

రాజకుమార్తె అలాగేనని యోగినికోసం కబురుపంపింది. యోగిని వచ్చింది. ఆమె రాజకుమార్తెను సమీపించే సమయంలో అలాదీన్ తెరవెనకనుంచి ఆ కపటయోగిని పైకి ఒక్క దూకు దూకి, తన కత్తితో ఆ మాయావి తల కిందపడగొట్టాడు.

"అయ్యో, అన్యాయంగా యోగినిని చంపి, ఎంత పాపకార్యం చేశారు!" అని రాజకుమార్తె ఆవేశంతో అన్నది.

అలాదీన్ చిరునవ్వు నవ్వి, తెగి పడి పోయిన యోగిని తలమీదినుంచి ముసుగు తొలగించాడు. ఆ ముఖాన గడ్డాలూ, మీసాలూ ఉండటం చూసి రాజకుమార్తె ఆశ్చర్యపడింది, భయపడిందికూడా.

అలాదీన్ ఈ మాయయోగినిని గురించి వివరంగా చెప్పి, "భగవంతుడు మనపట్ల దయగా ఉండబట్టే ఈ ఆఖరు శత్రువును కూడా వదిలించుకోగలిగాం. ఇక మనం ఎవరికీ భయపడవలిసిన అవసరం లేదు. ఇంతటితో మన కష్టాలు నిజంగా తీరిపోయి నట్టే!" అన్నాడు.

ఆతరవాత అలాదీన్‌కు చాలామంది పిల్లలు కలిగారు.

ముసలిదైపోయిన అలాదీన్ తల్లి ఎంతో మంది మనమలనూ, మనమరాళ్లనూ ఎత్తు కున్నది. వారంతా చాలా కాలంపాటు సుఖంగా జీవితం వెళ్లబుచ్చారు.

—[ అయిపోయింది ]





# గుణవతి

పూర్వం కాంచీపురంలో శక్తిసారుడనే వైశ్య యువకుడుండేవాడు. తండ్రి తాతలనుంచీ వస్తున్న వర్తకంలో అతను లక్షలకొద్దీ ధనం సంపాదించాడు. ఇరవయ్యో యేట అతనికి పెళ్ళాడాలనిపించింది.

"గృహిణః ప్రియహితాయ దారగుణాః" (భార్య గుణాలే గృహస్థుకు ప్రియాన్నీ, హితాన్నీ చేకూర్చుతాయి) అని అతను విని ఉన్నవాడు కావటంచేత శక్తిసారుడు సద్గుణవతి అయిన భార్యనే పెళ్లాడ నిశ్చయించుకున్నాడు. అందుచేత తనకు తగిన కన్యను తానే వెతుక్కునే ఉద్దేశంతో అతను దేశాలమీద బయలుదేరాడు.

శక్తిసారుడికి సాముద్రికం తెలుసును. సాముద్రికం చెప్పే మిషమీద అతను ఎంతో మంది కన్యల చేతులు చూశాడు. మంచి లక్షణాలు గల పిల్లగా కనిపించిన కన్యలకు అతను ఒక చిన్న పరీక్ష పెట్టేవాడు.

అతను ఈ ప్రయాణంలో తనవెంట రెండుశేర్ల వడ్లు తీసుకువెళ్ళాడు. ఆ వడ్లను తనకు నచ్చినట్టు కనపడిన పిల్ల కిచ్చి, "అమ్మాయీ, యీ వడ్లతో నాకీ పూట భోజనం వండి పెడతావా?" అని అడిగేవాడు. ఈ మాట విని కొందరు అతన్ని చూసి వెర్రివాడన్నట్టుగా నవ్వారు. మరి కొందరు ఆశ్చర్యపడి, "అది ఎలా సాధ్యమవుతుంది?" అన్నారు. కాని ఒక్కరు కూడా ఆ పని చేయలేకపోయారు.

ఇలా కన్యలను చూసుకుంటూ వెళ్లగా వెళ్లగా అతనికి ఒకనాడు కావేరీతీరాన ఒక కుటీరంలో గుణవతి అనే ఒక పిల్లా, ఆమెను సాకుతున్న ఒక వృద్ధురాలూ కనిపించారు. వారు నిరుపేదలు.

శక్తిసారుడు గుణవతి చెయ్యి చూసి, ఆమెలో మంచి లక్షణాలుండటం గమనించి, "అమ్మాయీ, నాదగ్గిర వడ్లున్నాయి. వాటితో

"చిదానంద"

నాకీపూట భోజనం వండి పెడతావా?" అని అందరినీ అడిగినట్టే ఆమెనుకూడా అడిగాడు.

గుణవతి ఈ మాట విని నవ్వనూ లేదు, ఆశ్చర్యపడనూ లేదు. ఆమె అతను కోరినట్టుగా ఆ వడ్లతో భోజనంచేసి పెట్టటానికి ఒప్పుకున్నది.

ఆమె వడ్లు తీసుకుని తడిపి ఆరబెట్టి, దంచి చెరిగి ఊక తీసింది. ఆ ఊకను అవ్వకిచ్చి, "దీన్ని బంగారు పనివాళ్లకు అమ్మి ఆ డబ్బులతో ఆటే పచ్చివీ, ఆటే ఎండువీ కాని కట్టెలూ, ఉసిరిపప్పూ పట్టుకురా," అన్నది.

అవ్వ అలాగే చేసింది. గుణవతి బియ్యం కడిగి పొయి వెలిగించి ఎసరు పెట్టింది. బియ్యం చిమడగానే వార్చి గంజి తీసి, అందులో కొంచెం ఉప్పువేసి, ఉసిరిపప్పు నూరి ముద్దచేసి శక్తిసారుడికిస్తూ, "ఈ ముద్ద నోట్లో వేసుకుని ఈ గంజి తాగండి. తరవాత కాస్సేపు విశ్రాంతి తీసుకుని స్నానం చేసి వచ్చారంటే భోజనం పెడతాను," అన్నది.

అన్నం కాగానే గుణవతి కొన్ని కట్టెలు ఆర్పి బొగ్గులు తీసి వాటిని అవ్వకిచ్చి, "వీటినికూడా ఎవరికైనా ఇచ్చి, కాస్త కూరా, మజ్జిగా పట్టుకురా!" అన్నది.

అవ్వ తెచ్చిన కూర వండి, భోజనాల వేళ దాటకుండానే గుణవతి అతిథిని స్నానం చేసి రమ్మన్నది.

శక్తిసారుడు స్నానంచేసి వచ్చి కూరా, మజ్జిగాతో సహా కడుపునిండా భోజనంచేశాడు. అతనికి గుణవతి పొదుపూ, యుక్తీ చూసి చాలా సంతోషమయింది. ఆమెకు తన అసలు వృత్తాంతం చెప్పేసి తనను పెళ్ళాడవలసిందిగా కోరాడు. గుణవతి ఒప్పుకున్నది. అతను ఆమెను తన ఊరికి తీసుకుపోయి పెళ్లి చేసుకుని చాలాకాలం సుఖంగా జీవించాడు.





# కాకోలూకీయం

పేరైన పురి మహి - లారోప్యమనగ ;
ఊరికావల నుండు - నొక పెద్ద మఱ్ఱి.
కొమ్మలు రెమ్మలు - గొనబుగా పెరిగి
గుమ్మటు మ్మట్టు లా - కులు నిండియుండు.
అట మేఘవర్ణు డ - న్నట్టి కాక పతి
వటముపై కాకుల - పాలించుచుండు.
చెంగటనే కొండ - చీకటి గవిని
దొంగ గూబల రాజు - దొరకొనియుండు.
అరిమర్దనుండను - నా గూబరాజు
మరగున రాత్రుల - చరచర వచ్చి
వటవృక్షమున నున్న - వాయసమ్ములను
పటపట పొడిచి చం-పుట పరిపాటి.
ఇటు కొన్నినాళ్ళలో-నే కాకులెల్ల
కటుశత్రునకు జిక్కి - కాటికి చేరె.
పగవాని నాపక - పడియున్న వాడు
పగవాని చేతిలో - పడి చావకున్నె.

పుట్టగనే రోగ-మును, శత్రుతతిని
గట్టిగా ద్రుంచి - కడతేర్చవలయు.
అటుకానిచో రోగ-మటు పగవాడు
తటుకున బలిసి నిన్ - కటకటవెట్టు.
కావున నీముప్పు - గడచు టెట్లంచు
రావించె మంత్రుల - రాజొక్కనాడు.
"మంత్రులారా వచ్చె - మనకొక ముప్పు
తంత్రమ్ము సేయు నీ - తఱి గూబరాజు.
సగరాత్రి ఇటువచ్చి - చంపు కాకులను
పగ లెట కేగునో - పాపి అతండు.
మనకు చూ పానదు - మఱి రాత్రులందు
మనకు కన్పించ డా-యన పగలెపుడు.
ఏమిసేయుద మిప్పు - డెది యుపాయమ్ము
మీ మతి యోచించి - మీ రానతిండు."

అని కాకరాజన - నా మంత్రులెల్ల
వెనక ముందాడ నా-యన గ్రహియించి

విద్వాన్ విశ్వం



ఒక్కొక్క మంత్రితో - నెక్కటి చేరి
చిక్కు తీర్పుమటంచు - చెచ్చెఱ నడిగె.

మంత్రి ఉజ్జీవనుడు :

బలవంతులైన-శత్రులతోడ పోరు
వలనుగాదెప్డు కా-కులరాజ వినుము.
గెలు పనుమానమౌ - బలవంతుతోడ
పిలిచి సంధిని సేయ-వలయు నచ్చోట.
భూమియో మిత్రులో - బోలెడు ధనము
కామించియో కదా - కదనము సేత.
అవి యేవి లాభింప-వని తేలుచోట
అవివేకమగు యుద్ధ - మాచరియింప.
ఎలుక బొక్కను త్రవ్వే-నేని సింహమ్ము
ఫలమేమి గోళ్ళూడు - పాపిష్ఠి రాళ్ళ.



కడకు సాధించెడు - కార్యమ్మదేమి
వెడలు నెల్కయె కదా - వేసట పడిన.
అదిగాక బలవంతు - నదిలింప తగదు.
ఎదురీతవలన నె-య్యది వచ్చు మనకు ?
సంధియే కార్య మీ-శత్రువుతోడ
ఇంధనమ్మగు పోరు - ఏమాత్ర తగదు.

మంత్రి సంజీవి :

పగవానితో సంధి - పరమ నష్టమ్ము
పగ పోవునా వట్టి - పల్కులె కాక.
పలుగాకి వానిదో - అలుసగుగాక
తలపోయ సామమ్ము - వలనుగాదెపుడు.
జ్వరము శీతజలాన - చల్లంగవడునె ?
కరమర్థి శత్రుల - నురుమాడవలయు
బలవంతుడన్నచో - బలిమిని గాక
మెలమెల్ల మాయతో - మెలిపెట్టవలయు.

మంత్రి అనుజీవి :

బలవంతుడా గూబ - పలుగాకి వాడు
తలపడగాదు చిం-తిల సంధి తగదు.
సంధి విగ్రహములు - చాలనియపుడు
బంధువు యానమ్మె - భావించి చూడ.
రెండు తెఱంగులౌ-చుండు యానమ్ము
బండెడు దొమ్మల - పాఱుట యొకటి
గండరి శత్రుల - పరిమార్చుదనుక
అండ చిక్కెడుదాక - అరుగుట యొకటి.



సమయమ్ము చూచి ని-ర్గమియింపవలయు
సమయమ్ము రాగనే - చనుదేరవలయు.
ముందుకు దూకగా - ముడుచుకొన్నట్లు
కందువ వీడిన - కలుషమ్ము లేదు.

ప్రజీవి మంత్రి :

ఈ మూడుకూడ నా - కెటు నచ్చలేదు.
సేమ మాసనమన్న - నీమ మొక్కటియె
మొసలి నీటను దాగి - మెసవు నేనుగును.
వెస నీరు విడెనేని - విడి కుక్కగూడ
మొసలి ముక్కలు చేసి - కసకస నమలు
పస జూపవలె కోట-పట్టున నిల్చి.
పగవాని కోడి స్థా-వరమును వీడ
వగజెందు నాతడు - స్వస్థాన లుప్తి.
కట్టుగా నున్నచో - కాకులు చాలు
గట్టిగా నిలిచి ఇ-క్కడె గెల్వవచ్చు.

మంత్రి చిరంజీవి :

నాకు సమాశ్రయ-నయము సమ్మతము
ఈకడనే నిల్చి - ఏ గొప్పవాని
ఆశ్రయమో మన - మందంగవలయు
ఆశ్రయ మున్నచో - నది లెస్స మనకు.
పొదరింటిలో నున్న - వెదురు నెవ్వారు.
కదలింపగాలేరు-కద లోకమందు.

మంత్రి స్థిరజీవి :

ఇవియన్నియును మంచి-వేయగు గాని
అవి యాచరించుట - కద నిది కాదు.



కలదు ద్వైధీభావ-మల ఉపాయమ్ము
చలపట్టి నమ్మించి - చంపెడు తీరు.
మెలమెల్ల పగవాని - కలరూపు దెలిసి
అల వాని వారల - నటునిటు త్రిప్పి
బలహీను చేసి చం-పగవలె కాచి
కలవారి కలరూపు - గాలించవలయు.

* * *

ఇటు మంత్రులెల్ల నే-దేదొ విన్పింప
కటకటపడుచున్న - కాకరాజనియె

కాకరాజు :

స్థిరజీవి మంత్రి! ఈ-తెఱగు విన్పింపు
మరి గూబలును కాకు-లరులగు టేల ?




అనేక వందల సంవత్సరాలక్రితం పర్షియా దేశాన్ని సాబూర్ అనే చక్రవర్తి పరిపాలించేవాడు. ఆనాడు ప్రపంచంలో ఎక్కడా ఆయనను మించిన సార్వభౌముడు లేడు. దానధర్మాలు చెయ్యటంలోనూ, ప్రజలను సుఖపెట్టటంలోనూకూడా ఆయనకు సాటి ఎవరూలేరు. ఆయన భవనంలోకి ఎటువంటివారైనా స్వేచ్ఛగా ప్రవేశించి, తమకు కావలిసిన కోరికలు కోరవచ్చు; చక్రవర్తి నోట ఎన్నడూ, "లేదు" అన్న మాట వచ్చేదికాదు.

సాబూర్ చక్రవర్తికి కమరల్ అక్మార్ అని ఒక కొడుకూ, ముగ్గురు అందగత్తెలైన కుమార్తెలూ ఉండేవారు. ఆయన ఏటా రెండు ఉత్సవాలు జరిపేవాడు. ఒకటి వసంతకాలంలో జరిగేది, రెండవది శరత్కాలంలో జరిగేది. ఈ ఉత్సవాలప్పుడు చక్రవర్తి బ్రహ్మాండమైన విందులూ, సమారాధనలు చేసేవాడు. ఈ ఉత్సవాలకు ప్రపంచం అన్ని మూలలనుంచీ జనం వచ్చి, చక్రవర్తికి బహుమతులిచ్చి, ఆయనవల్ల సత్కారాలు పొందేవారు.

ఈ రెండు ఉత్సవాలకూ కొందరు ఖైదీలు విడుదల అయేవారు; ఉద్యోగులకు హోదాలూ, జీతాలూ పెరిగేవి.

ఒక ఏడు వసంతోత్సవానికి ముగ్గురు సిద్ధులు వచ్చారు. వారిలో ఒకడు హిందూదేశంనుంచి వచ్చాడు, రెండవవాడు రూమీదేశంనుంచి వచ్చాడు, మూడవవాడు పర్షియాలోనే ఉన్న ఒక దూరప్రాంతం నుంచి

ఆర్. దయానందరావు



వచ్చాడు. అందరిలాగే ఈ సిద్ధులుకూడా రాజుగారికి మూడు వస్తువులు బహుమానంగా పట్టుకు వచ్చారు. అయితే వీరు తెచ్చిన మూడు వస్తువులూ చాలా అపూర్వమైనవి.

హిందూదేశంనుంచి వచ్చిన సిద్ధుడు రాజుగారికి ఒక బంగారు మనిషివిగ్రహం బహూకరించాడు. ఆ విగ్రహం చేతిలో ఒక బంగారు బాకా ఉన్నది. రాజు ఆ విగ్రహాన్ని చూసి ముచ్చటపడి, "ఇది చాలా అందంగా ఉన్నది, కాని దీనివల్ల ఉపయోగమేమిటి ?" అని అడిగాడు.

"మహాప్రభూ, దీనిని మీ కోటద్వారం వద్ద ఏర్పాటుచేయించండి. శత్రువులెవరైనా కోటకేసి వచ్చినప్పుడు, ఈ విగ్రహం వారిని దూరంనుంచే పసిగట్టి, చేతిలో ఉన్న బాకాను నోటివద్దకు ఎత్తి ఊదుతుంది. ఆ చప్పుడు విని శత్రువులు చెల్లాచెదరై పారి పోతారు. ఈ విగ్రహం తమ కోటముందు ఉన్నంత కాలమూ తమకు శత్రుభయ మన్నది ఉండదు," అన్నాడు హిందూ దేశపు సిద్ధుడు.

తరవాత చక్రవర్తి రూమీదేశపు సిద్ధుడు తెచ్చిన బహుమతికేసి చూశాడు. ఒక విశాలమైన వెండిపలకమధ్యను ఒక బంగారు మగనెమలి ఉన్నది; దానిచుట్టూ బంగారు ఆడనెమళ్లు అమర్చబడి ఉన్నాయి. అదికూడా చూడటానికి చాలా అందంగా ఉన్నది. దానివల్ల ఉపయోగమేమిటని చక్రవర్తి అడిగాడు.

"మహాప్రభూ, ఈ ఆడనెమళ్లు గంట కొకటివంతున రోజుపొడుగునా కూసి గంటలు తెలుపుతాయి. ఈ మగనెమలి నెలకొకమారు నోరు తెరిచి చంద్రవంకను చూపుతుంది. ఇదే ఈ నెమళ్లలో గల విశే షం," అన్నాడు రూమీదేశపు సిద్ధుడు.

చక్రవర్తి సంతోషించి మూడో బహుమా నాన్ని తిలకించాడు. అది నల్లకర్రతో చేసిన గుర్రం. దానిపైన బంగారు నగిషీలూ,

తాపటం చేసిన రత్నాలూ వున్నాయి. దాని వీపున ఎక్కి కూర్చోవటానికి వీలుగా జీనూ, కాళ్లు పెట్టుకోవటానికి రికాబులూ వున్నాయి.

"చూడటానికి ఈ గుర్రం చాలా ముచ్చటగానే వున్నది. కాని దీనివల్ల ప్రయోజనమేమిటి?" అని చక్రవర్తి అడిగాడు.

దానికి పర్షియాదేశపు సిద్ధుడు, "మహాప్రభూ, ఇది కీలుగుర్రం. ఎవరైనాసరే దీనిపై ఎక్కి ఆకాశమార్గాన ఎక్కడికిపడితే అక్కడికి అతివేగంగా వెళ్లవచ్చు. మామూలు గుర్రాలపై ఒక ఏడాదిలో వెళ్లే దూరం దీనిపైన ఒక్కరోజులోనే వెళ్లవచ్చు!" అని జవాబిచ్చాడు.

"అద్భుతం! మీరు తెచ్చిన మూడు బహుమానాలూ అత్యద్భుతంగా వున్నాయి. వీటిని పరీక్షించితేగాని వీటి మహిమను నేను నమ్మలేను!" అన్నాడు చక్రవర్తి సాబూర్.

వెంటనే మూడు వస్తువులనూ పరీక్షకు పెట్టారు. అవి పరీక్షలో నెగ్గాయి. బంగారు విగ్రహం కోటకేసి వచ్చే సైనికులను చూడగానే బాకా వూది వారిని కంగారుపరిచింది. ఆడనెమళ్లు గంట గంటకూ కూతలు కూశాయి. పోతే, కీలుగుర్రాన్ని తెచ్చిన సిద్ధుడే దానిపై ఎక్కి ఆకాశంలోకి ఎగిరి, చాలాసేపు గుండ్రగా తిరిగి చివరకు చక్రవర్తి ముందు వాలాడు.



ఈ వింతలు చూసి చక్రవర్తి పొందిన అశ్చర్యం ఇంతా అంతా కాదు. అయన ముగ్గురు సిద్ధులనూ పిలిచి, "మీరు నాకు వెలలేని వస్తువులు తెచ్చి బహుమానంగా ఇచ్చారు. అందుకు ప్రతిఫలంగా మీరు కోరిన కోరికలు తీర్చటం నా విధి. కనుక నావల్ల మీకు ఏమికావాలో చెప్పండి. సంకోచించకుండా మీ కోరికలు ఏవైనాసరే నెరవేర్చుతాను," అన్నాడు.

వారు ముగ్గురూ రాజకుమార్తెలను వివాహమాడగోరారు. చక్రవర్తి సంకోచించక వెంటనే కాజీని పిలిపించి, నిండుసభలో వివాహపత్రాలు రాయించాడు.

చక్రవర్తి తన పెద్దకూతురిని హిందూ దేశపు సిద్ధుడికీ, రెండవ కుమార్తెను రూమీ దేశపు సిద్ధుడికీ, మూడవ కుమార్తెను పర్షియా దేశపు సిద్ధుడికి ఇచ్చి త్వరలోనే పెళ్లి చేసేటట్టుగా ఏర్పాటయింది.

ఈ వివాహపత్రాలు తయారుకావటమంతా రాజకుమార్తెలు పరదావెనకనుంచి చూస్తూనే వున్నారు. వారు ముగ్గురిలోనూ చిన్నది తన అక్కలకన్నకూడా ఎంతో గొప్ప అందగత్తె. ఆమె తనకు కాబోయే భర్తను చూడగానే దడుచుకున్నది. ఎందుచేతనంటే ఆమెకు భర్త కానున్న పర్షియా దేశపు సిద్ధుడు శతవృద్ధుడు. శరీరమంతా





ముడతలు పడి, కళ్లు గుంటలు పడి, చూడ టానికే మహా వికారంగా వున్నాడు.

అలాటి ముసలితొక్కు తనకు భర్త కాబోతున్నాడని తెలియగానే ఆమె దుఃఖం అపుకోలేక తన గదికి వెళ్లిపోయి, పక్కమీద బోర్లాపడి వెక్కి వెక్కి ఏడవసాగింది. శోకా వేశంలో ఆమె తన దుస్తులు చించుకున్నది, గోళ్లతో ముఖమంతా రక్కుకున్నది, జుట్టు చిందరవందర చేసుకుని శోకదేవతలాగా తయారయింది.

ఇది జరిగిన సమయాన రాజకుమారుడు అక్మార్ వేటకు వెళ్లివున్నాడు. అతను తిరిగి వస్తూనే తన చిట్టిచెల్లెలు స్థితి గమనించాడు.



అతను వెంటనే ఆమెను సమీపించి, "ఎందు కేడుస్తున్నావు, చెల్లీ ? నీకేం కష్టం వచ్చిందమ్మా ? దాచకుండా నాతో నిజం చెప్పు!" అన్నాడు.

రాజకుమార్తె మరింత గట్టిగా ఏడుస్తూ, "నేనేమీ దాచను, అన్నా! నే నసలు ఈ ఇంట్లో వుండను. ఎక్కడికైనా వెళ్లి అడుక్కుతింటాను! నాన్న నాకు ఇంత అన్యాయం చేస్తున్నప్పుడు ఇక నాకు అల్లా తప్ప వేరు దిక్కులేదు!" అన్నది.

"నాన్న నీకు చేస్తున్న ద్రోహమేమిటో చెప్పు! నిష్కారణంగా నీ మనస్సును క్షోభ పెట్టుకోకు!" అన్నాడు అక్మార్.

"అన్నా, ఏంచెప్పను ? నాన్న నన్నొక భయంకరమైన ముసలాడి కిచ్చి పెళ్లి చేస్తా నని మాట యిచ్చాడు. ఆ ముసలాడు చూస్తే ఎవరో మాయలముచ్చులాగున్నాడు. వాడొక కీలుగుర్రాన్ని తెచ్చి నాన్నకు బహు మానం ఇచ్చి ఆయనను బుట్టలో వేసు కున్నాడు. నేనుమాత్రం ప్రాణమైనా తీసు కుంటానుగాని ఆ ముసలాణ్ణి పెళ్లాడను," అన్నది రాజకుమార్తె.

కమరల్ అక్మార్ చెల్లెల్ని అనేకవిధాల బుజ్జగించి సముదాయించి, తండ్రి వద్దకు వెళ్లి, "నాన్నా, ఎవడో మాయలమారివాడు



తెచ్చి నీకేదో బహుమానం ఇచ్చాట్ట; ఆ భాగ్యానికే నువు మన అమ్మాయిని వాడి కిచ్చి పెళ్లిచేయ సిద్ధపడ్డావుట! ఈవిధంగా అమ్మాయి గొంతు కొయ్యటం భావ్యమేనా? అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు!" అన్నాడు కోపంగా.

చక్రవర్తి సమీపంలోనే ఉండి ఈ మాటలు వింటున్న సిద్ధుడికి పట్టరాని కోపం వచ్చింది. కాని ఇంతలోనే చక్రవర్తి, "నాయనా, ఈ సిద్ధుడు తెచ్చిన కీలు గుర్రాన్ని స్వయంగా చూసిఉంటే నువ్విలా మాట్లాడవు," అంటూ తన కొడుకును బయటి ప్రాంగణంలోకి తీసుకువెళ్లాడు.

రాజసేవకులు కీలుగుర్రాన్ని తెచ్చి రాజ కుమారుడి ముందు పెట్టారు. దాని అందం చూడగానే అక్మార్ ముఖం విప్పారింది. అతను గుర్రపుస్వారీలో నిపుణుడు కావటం చేత, చెంగున కీలుగుర్రంపై ఎక్కి కూచున్నాడు. అతను మామూలు గుర్రాన్ని అదిలించినట్టే కీలుగుర్రాన్ని డొక్కలో మడ మలతో గట్టిగా కొట్టాడు, కాని కీలుగుర్రం ఏమాత్రం కదలలేదు.

చక్రవర్తి సిద్ధుడికేసి తిరిగి, "గుర్రం కదలటంలేదు. అది కదిలే ఉపాయం మావాడికి చెప్పండి!" అన్నాడు. సిద్ధుడు రాజకుమారుడిదగ్గిరికి వెళ్లి, "గుర్రం



మెడలో కుడిపక్కన బంగారు మీట కని పిస్తున్నదే, దాన్ని పక్కకు తిప్పితే గుర్రం పైకి లేస్తుంది," అన్నాడు.

రాజకుమారుడు మీట తిప్పాడు. మరు క్షణం గుర్రం శరవేగంతో ఆకాశంలోకి సూటిగా లేచి, కొద్ది క్షణాలలో కంటికి కని పించకుండా పోయింది.

తన కొడుకు తిరిగి రావటంకోసం చక్ర వర్తి చాలాసేపు ఎదురుచూశాడు. ఎన్ని గంటలు గడిచినా అతని జాడ లేకపోవటం చూసి ఆయనకు ఆందోళన కలిగింది. ఆయన సిద్ధుడితో, "స్వామీ, మావాడు తిరిగి రావటానికి మనం ఏమి చెయ్యాలి ?" అని అడిగాడు.

తనకు రాజకుమార్తె నిచ్చి పెళ్లి చెయ్య గూడదన్నప్పటినుంచీ ఈ సిద్ధుడికి రాజ కుమారుడిపైన చాలా కోపంగా ఉంది. అందుచేతనే ఆయన అతడికి గుర్రాన్ని తిరిగి భూమిపైన దింపే కిటుకు చెప్పలేదు.

"రాజా, మనం చేయగలిగింది ఏమీ లేదు. నీ కుమారుడు తిరిగి వచ్చేమాట కల్ల. ఎందుచేతనంటే గుర్రాన్ని దింపే కిటుకు నేను చెప్పేలోగా మీవాడు మీట నొక్కి ఆకాశంలోకి వెళ్లిపోయాడు. అతను అంత తొందరపడటం అతని తప్పే!" అన్నాడు సిద్ధుడు.

ఈ మాటలు వినగానే చక్రవర్తికి సిద్ధుడి పైన పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆ కోపంలో ఆయన తన భటులను పిలిచి, "ఈ దుర్మార్గుణ్ణి చావగొట్టి కారాగృహం లోకి తొయ్యండి!" అని ఆజ్ఞాపించాడు. వారు అలాగే చేశారు.

ఆ తరవాత చక్రవర్తి దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. ఆయన శోకం గమనించి రాజోద్యోగులు ఉత్సవాలు నిలుపుచేసి, దివాణం తలుపులు మూయించి, రాజ కుమారుడు కమరల్ అక్మార్ పోయినందుకు సంతాప ప్రకటనచేశారు. —(ఇంకా ఉంది)





# దొంగలకు నాయకుడు

పూర్వం ఒక అరణ్యంలో ఒక గజదొంగల ముఠా ఉండేది. ఆ దొంగలు ఆ చుట్టు పక్కల ఎన్నో దొంగతనాలు చేసి అంతులేని సొమ్ము కొల్లగొట్టారు. అయితే ఆ దొంగలను పట్టుకున్నవారు లేరు. కనీసం వారుండే చోటుకూడా ఎవరికీ తెలియదు.

ఆ అరణ్యంలోనే ఒక పేదవాడూ, అతని భార్యా, ఆనందుడనే కొడుకూ ఉండేవారు. ఆనందుడు కొంచెం పెద్దవాడయాక వాడికి దొంగలను గురించి తెలియవచ్చింది. తన శరీరంమీద ఒక చింకిచొక్కా కూడా లేక పోవటానికి కారణం దొంగలేననీ, వాళ్లు ఆ చుట్టుపట్ల ఉండే ప్రతి ఒక్కరినీ దరిద్రులుగా చేశారనీ వాడు విన్నాడు. విని ఈ దొంగలందరినీ తాను ఎలాగైనా హతమార్చాలి అనుకున్నాడు.

"నాయనా, నువు పసివాడివి. ఆరితేరిన దొంగలను నువ్వేం చెయ్యగలవురా? వాళ్లు అతి సులువుగా నీ ప్రాణాలు తీయగలరు!" అన్నారు వాడి తల్లిదండ్రులు.

అయినా ఆనందుడి బుద్ధి మారలేదు. ఎలాగైనా దొంగలను హతమార్చాలన్న కాంక్ష వాడిలో రోజురోజుకూ ఎక్కువ కాసాగింది. చిట్టచివరకు ఒకనాడు వాడు తల్లిదండ్రులతో చెప్పి, దొంగలుండే చోటికి పోతానని బయలుదేరాడు.

ఆనందుడా అరణ్యంలో పడి పోగాపోగా కొంతసేపటికి తీవ్రమైన గాలివాన వచ్చింది. వానకు తడుస్తూ, దారీ తెన్నూ కనబడని ఆ అరణ్యంలో పడి కొంతదూరం వెళ్లగా, దూరాన వాడికొక దీపం కనబడింది.

ఆనందుడు ఆ దీపం వున్నచోటు గుర్తు పెట్టుకుని నేరుగా వెళ్లి ఒక భవనం చేరుకుని తలుపు తట్టాడు.

అది చాలా పెద్ద భవనం. అరణ్యం మధ్య అంత పెద్ద భవనం ఉంటుందని

పి. రామశర్మ



ఆనందుడు కలలోకూడా ఊహించలేదు. అది దొంగలుండే భవనం.

ఒక ముసలిది వచ్చి తలుపు తెరిచింది. ఇంట్లో ఆ ముసలిది తప్ప ఆ సమయాన ఇంకెవరూ లేరు.

"అవ్వా, బయట చాలా దారుణంగా ఉంది. లోపలికి రావచ్చునా?" అన్నాడు ఆనందుడు.

"లోపల నీ గతి ఇంకా దారుణంగా ఉంటుంది, నాయనా. లోపలికి రాకు!" అన్నది ముసలిది.

"ఎందువల్ల నవ్వా?" అని అడిగాడు ఆనందుడు.

"ఎందువల్లనా? ఇది దొంగలుండే చోటు. వీళ్లు నన్ను ఎత్తుకొచ్చి నాచేత అడ్డమైనచాకిరీ చేయించుకుంటున్నారు. వీళ్లకి దయాదాక్షిణ్యాలు ఏ కోశానా లేవు. కనిపించిన మనిషి దగ్గిర ఏమున్నా లాగేసుకుంటారు. ఏమీ లేకపోతే ప్రాణాలన్నా తీసుకుంటారు," అన్నది అవ్వ.

"వెధవ ప్రాణాలు పోతే పోయాయిలే. బయట గాలివానలో చచ్చేకన్న హాయిగా వెచ్చగా ఈ ఇంట్లో చస్తాను," అంటూ ఆనందుడు లోపలికి వచ్చాడు.

ఇంటినిండా ధనం కుప్పలుకుప్పలుగా పోసిఉన్నది. ఆనందుడా కుప్పలమధ్య చోటుచేసుకు పడుకుని, నిద్రపోవటానికి కళ్లు మూసుకున్నాడు.

ఇంతలోనే దొంగలు వచ్చి ఆనందుణ్ణి చూసి, "వీడెవడు? వీడిదగ్గిర డబ్బేమైనా ఉందా?" అని అవ్వను అడిగారు.

"వాడి వొంటిపైన చొక్కాకూడా లేదు. డబ్బేముంటుంది?" అన్నది అవ్వ.

ఈ మాటలు విని దొంగలు నవ్వుకుని, "అయితే వీడు మన రాజ్యంలోవాడే అయి ఉంటాడు. వీణ్ణి ఇప్పుడే చంపుదామా? లేక రేపు ఉదయందాకా హింసపెడదామా?" అని వితర్కించుకున్నారు.

ఈ మాటలు ఆనందుడు విన్నాడు. వ్యవహారం శ్రుతిమించి రాగాన పడుతున్న దని తెలుసుకుని వాడు దొంగలతో, "అయ్యా లారా, నాకు చిన్నతనంనుంచీ దొంగ కావా లని చాలా సరదా. అందుచేత మీ నౌక రుగా పనిచేయటానికి వచ్చాను," అన్నాడు.

ఈ మాటలకు దొంగలు సంతోషించి, "అలా చెప్పవేం మరీ ? మేము కొత్తవాళ్లను తీసుకుంటూనే ఉంటాం. అయితే మాలో చేరదలిచినవారికి ఒక పరీక్ష ఉన్నది. అదేమిటంటే, మా శిష్యుడు కాదలిచిన వాడు పట్టుబడకుండా, ఎవరికీ హాని చెయ్య కుండా ఒక్క దొంగతనం చెయ్యాలి. అలాటి దొంగతనాలు రెండు చేసినవారిని మాతో సమంగా చూస్తాం. మూడు దొంగ తనాలు అలాటివి చేసినవాణ్ణి మేము నాయ కుడుగా పెట్టుకుంటాం. జ్ఞాపకం ఉంచుకో– నువు ఎవరి సొత్తు దొంగతనం చేస్తావో వారికి తెలియకుండా దొంగతనం జరగాలి ; వారికి ఎటువంటి హానీ జరగకూడదు," అన్నారు వాళ్లు.

ఆనందుడు సరేనన్నాడు. వాడు మర్నాడు ఉదయమే దొంగలుండే ఇంటినుంచి బయలుదేరాడు. బయలుదేరేటప్పుడు ఆ ఇంటో కనిపించిన అందమైన పాదరక్ష ఒకటి తీసుకున్నాడు. ఆ పాదరక్షను ఒక







కాలిబాటమీద ఉంచి ఆనందుడు సమీపంలో ఉన్న పొదలలో దాక్కున్నాడు.

కొంతసేపటికి ఒక కాపు ఒక ఎద్దును అమ్మటానికి తోలుకుపోతూ ఆ దారివెంట వచ్చాడు. ఆ కాపు దారిలో ఉన్న పాద రక్షను చూసి, "మంచి చెప్పే, కాని ఒకటే అయిపోయింది. జత ఉంటే బాగుండేది," అనుకుంటూ ముందుకు సాగిపోయాడు.

కాపు కనుచాటు కాగానే ఆనందుడు పొదలలోనుంచి వచ్చి ఆ పాదరక్షను తీసు కుని అడ్డదారిన పరిగెత్తి ముందుకు పోయి, మళ్లీ ఆ పాదరక్షను కాపు వచ్చేదారిలో పెట్టి పక్కనే పొదలమాటున దాగాడు.

కొంతసేపటికి కాపు వచ్చి పాదరక్షను చూసి అది మొదటిదాని జత అనుకున్నాడు. అతను తన ఎద్దును ఆ సమీపాన వున్న చెట్టుకు కట్టేసి వెనక్కు తిరిగి వెళ్ళాడు. ఆనందుడు పొదలచాటునుంచి వచ్చి ఎద్దును విప్పి దానితో దొంగలుండే ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆనందుడు చేసిన దొంగతనం గురించి విని దొంగలు సంతోషించి, వాణ్ణి తమ శిష్యుడుగా చేర్చుకున్నారు. అయితే ఆనం దుడికి కావలిసింది దొంగలకు నాయకుడు కావటం. అందుచేత వాడు ఇలాటివే మరి రెండు దొంగతనాలు చేయ నిశ్చయించు కుని, ఒక పగ్గం తీసుకుని బయలుదేరి మళ్లీ అడివిలోకి వెళ్లాడు.

ఈలోపుగా కాపు తన ఎద్దు కాస్తా పోయి నందుకు విచారించి, ఇంటికి తిరిగి వెళ్లి తన రెండో ఎద్దును అమ్మటానికి తోలుకురా సాగాడు. ఆనందుడు ఈ సంగతి గ్రహించి కాపు వచ్చే దారిలో ఒక చెట్టు ఎక్కి, దాని కొమ్మకు పగ్గం కట్టి, దాన్ని తన రెండు చంకలకిందా కట్టుకుని వెళ్లాడబడి, చని పోయినవాడిలాగా నటించాడు.

అలా వేళ్ళాడుతున్న ఆనందుణ్ణి చూసి, "వీడికి ఎవరో మంచి శాస్తి చేశారు.





అరణ్యంలో ఉన్న దొంగలకందరికీ ఇలా చేస్తే బాగుండును!" అనుకుంటూ కాపు ముందుకు సాగివెళ్ళాడు.

కాపు కనుమాటు కాగానే ఆనందుడు తన చేతులు పగ్గంవుచ్చులోనుంచి లాగేసుకుని, అడ్డదారిన ముందు వెళ్లి, కాపు అటుగా వచ్చేలోగా మరొక చెట్టుకు వేళ్లాడబడ్డాడు. కాపు వాణ్ణి చూసి, "మరొకడికికూడా శిక్ష జరిగిందే!" అనుకుని ముందుకు సాగాడు.

ఆనందుడు అడ్డదారిన ఇంకా ముందుకు వెళ్లి మూడో చెట్టుకు వేళ్లాడబడ్డాడు. మూడో సారి వాణ్ణి చూసేసరికి కాపుకు సందేహం వచ్చింది. "వీడు చూస్తే ఆ మనిషేలాగా వున్నాడే, ఇన్ని చెట్లమీద ఎలా చచ్చాడు? ఈ సంగతి తేల్చుకోవలిసిందే!" అనుకుని, ఎద్దును ఒక చెట్టుకు కట్టేసి వెనక్కు పరిగెత్తాడు.

కాపు వెళ్లగానే ఆనందుడు తన కట్లు విడిపించుకుని, పగ్గం భుజాన వేసుకుని, ఎద్దును విప్పి దొంగల వద్దకు తోలుకు వెళ్లాడు. "భేష్! నిన్ను మాలో ఒకడుగా చేర్చుకున్నాం!" అన్నారు దొంగలు.

తన రెండో ఎద్దుకూడా పోయేసరికి కాపుకు చాలా బాధ కలిగింది. ఇంక అతని వద్ద ఒక్క ఎద్దే మిగిలింది. దాన్ని అమ్మక



పోతే అతనికి జరగదు. అందుచేత అతను మళ్లీ ఇంటికి తిరిగివెళ్లి, తన మూడో ఎద్దును తీసుకుని, దొంగల జాడకోసం శ్రద్ధగా చూస్తూ అడవిదారివెంట రాసాగాడు. అతను కొంతదూరం వచ్చేసరికి, దారిపక్కన వున్న పొదల వెనకనుంచి ఎద్దురంకె వినబడింది.

"అది నా ఎద్దే! ఎలాగో కట్టు విప్పుకుని అడవిలో మేయటానికి పోయివుంటుంది. ఒక వేళ రెండు ఎద్దులూ ఉన్నాయేమో!" అని ఆశపడుతూ, కాపు తన మూడో ఎద్దును దారిపక్కనున్న ఒక చెట్టుకు కట్టేసి పొదలలో తన పోయిన ఎద్దులను వెతకటానికి బయలుదేరాడు.



కాని, పొదలచాటునుంచి రంకె వేసినది ఆనందుడే. కాపు పొదలలోకి వెళ్లగానే వాడు ఇవతలికి వచ్చి మూడో ఎద్దునుకూడా విప్పుకుని దొంగలవద్దకు తోలుకువెళ్లాడు.

జరిగినదంతా విన్నాక దొంగలు తమ నియమంప్రకారం ఆనందుణ్ణి తమ నాయకుడుగా అమోదించారు. "ఇక మేము చెయ్యవలిసిన దొంగతనా లేవో నువే నిర్ణయించాలి. నీ ఆజ్ఞలప్రకారం మేము ఈ ప్రాంతాల దొంగతనాలు చేస్తాం!" అని వారు ఆనందుడితో చెప్పారు.

"అయితే ఫలానిచోట రేపురాత్రి దొంగతనం జరగాలి. అది పేదగుడిసెలాగా కనిపిస్తుంది, కాని అక్కడ మనకు కావలిసినవి చాలా వున్నవి!" అంటూ ఆనందుడు దొంగలకు తన ఇంటి గుర్తులు చెప్పాడు. దొంగలు సరేనన్నారు.

తరవాత ఆనందుడు ఒంటరిగా తన ఇంటికి వెళ్ళి తన తండ్రితో, "నాన్నా, రేపు రాత్రికి మన ఇంటికి దొంగలందరూ వస్తారు. అందుచేత నువువెళ్ళి రాజభటులను తెచ్చి ఇంట్లో దాచివుంచు! దొంగలందరూ దొరికిపోతారు," అని చెప్పాడు.

అంతా ఆనందుడు నిర్ణయించినట్టుగానే జరిగింది. దొంగలు మర్నాడు రాత్రి ఆనందుడి ఇంటికి దొంగతనానికి వెళ్ళి రాజభటులకు చిక్కిపోయారు. ఆ ప్రాంతాల దొంగల పీడ లేకుండాపోయింది. అక్కడ వుండే ప్రజలు ఆనందుడివెంట దొంగలుండే భవనానికి వెళ్ళి పోయిన తమ సొత్తును గుర్తించి తెచ్చుకున్నారు. ఎవరిది వారు తీసుకోగా ఇంకా బోలెడంత ధనమూ నగలూ మిగిలిపోయాయి. ప్రజలు ధాన్ని ఆనందుడికి వదిలేశారు. ఆనందుడు కాపుకు అతని మూడు ఎద్దులనూ తిరిగి ఇచ్చివేశాడు. ఆతరవాత అతను తన తల్లి దండ్రులను దొంగల భవనానికి తీసుకుపోయి అక్కడే సుఖంగా వున్నాడు.






## 12

[దేశంకాని దేశాలలో రూపధరుడు నానా అగచాట్లూ పడి స్వదేశాన్ని చేరుకునే సమయంలో, అతడి కుమారుడు ధీరమతి తన తండ్రి ఆచోకీ తెలుసుకోవాలని నిశ్చయించాడు. రూపధరుడి భార్యను పెళ్లాడగోరిన అనేకమంది రాజకుమారులు తన ఇంట చేరి ఇల్లు గుల్లచేయటం అతనికి నచ్చలేదు. ఈ విషయమై ఒక సమావేశం జరిపినా ప్రయోజనం లేకపోయింది. అందుచేత ధీరమతి తన తండ్రి వార్తలు తెలుసుకునేటందుకు నౌకలో ఇథకానుంచి పైలాస్‌కు బయలుదేరాడు.]

నౌక పైలాస్‌తీరాన్ని తాకేసరికి మర్నాడు బాగా తెల్లవారిపోయింది. సముద్రతీరాన ప్రజలు వరుణదేవుడికి నల్లటి ఎద్దులను బలిచేస్తున్నారు. అక్కడ తొమ్మిది జట్లు చేరి ఉన్నాయి. ఒక్కొక్క జట్టులోనూ అయిదేసి వందలమంది ఉన్నారు. తీరం పొడుగునా తొమ్మిది గాడిపొయ్యిలు మండుతున్నాయి; వంటలు సాగుతున్నాయి.

నావికులు తెరచాపలు దింపి పడవను ఒడ్డున కట్టేశాక, ధీరమతీ, అతనివెంట వచ్చిన వృద్ధుడు సహనుడూ ఒడ్డుకు దిగి నడవసాగారు.

"మనం ఇప్పుడు నవద్యోతుణ్ణి చూడబోతున్నాం. నువు బిడియపడకుండా ఆయనతో వచ్చిన పని చెప్పెయ్యి. మీ నాయన వృత్తాంతం అడుగు. మీ తండ్రివార్తలేమైనా

గ్రీకు పురాణగాథ



ఆయనకు తెలిశాయా? ఆయన మరణించాడా? మరణిస్తే ఎప్పుడు, ఎక్కడ మరణించాడు? ఈ వివరాలు నవద్యోతుడికి తెలుసునేమో కనుక్కో. నవద్యోతుడికి నిజం తెలియాలేగాని దాచిపెట్టే రకం కాదు; చాలా పెద్దమనిషి. ఈ ప్రశ్నలు ఆయనను నీవే అడగటం భావ్యంగా ఉంటుంది," అన్నాడు ధీరమతితో సహనుడు.

"నేనింకా కుర్రవాణ్ణి. పెద్దవాళ్లతో మాట్లాడటం చాతకాదు, అదే నాకు భయంగా ఉంది," అన్నాడు ధీరమతి. సహనుడు ఆ యువకుడికి ధైర్యంచెబుతూ, నవద్యోతుడూ ఆయన కుమారులూ కూర్చుని ఉన్న శిబిరానికి తెచ్చాడు.

ఎవరో కొత్తవారు వస్తూండటం చూసి నవద్యోతుడి కుమారులు ధీరమతికీ, సహనుడికీ ఎదురువచ్చి స్వాగతం తెలిపారు; తరవాత వారు నవద్యోతుడికి సమీపంగా మెత్తని తోళ్లు ఇసకపై పరిచి, అతిథులను వాటిపై కూర్చోబెట్టి ఆహారమూ, ద్రాక్ష రసమూ ఇచ్చారు.

వారు కడుపునిండా భుజించాక నవద్యోతుడు తన అతిథులకేసి తిరిగి, "ఇప్పుడు చెప్పండి, మీరెవరు? మీరు ఏ దేశంనుంచి సముద్రం దాటి వస్తున్నారు? ఇక్కడికే పని



పెట్టుకుని వచ్చారా? లేక ఇటుగా పోతూ దారిలో ఆగారా?" అని అడిగాడు.

ధీరమతి ధైర్యంగా జవాబిచ్చాడు.

"మహారాజా, మాది ఇథకా. నేను స్వంత పనిమీదనే వస్తున్నాను. ట్రోయ్ యుద్ధరంగంలో మీ సరసను యుద్ధంచేసిన నా తండ్రి రూపధరుడి వార్తలు తెలుసుకునే నిమిత్తమై నేను బయలుదేరి వచ్చాను. యుద్ధానికి వెళ్లినవారందరి వార్తలూ తెలిశాయి, కాని నా తండ్రివార్త చెప్పేవారు లేకుండా ఉన్నారు. ఆయన చనిపోయినట్టు మీకు రూఢిగా తెలిస్తే ఆ సంగతి దయచేసి చెప్పండి. మీరందరూ కలిసి యుద్ధరంగంలో ఎన్నో కష్టాలు పంచుకున్నారు. అందుకైనా మీకు తెలిసిన విషయాలు నాతో దాచకుండా చెప్పండి."

ఈ మాటలు విని అతనితో నవద్యోతుడిలా అన్నాడు:

"నాయనా, ఒక్కసారిగా జరిగిన విషయాలు జ్ఞాపకంచేశావు. వజ్రకాయుడి నాయకత్వంకింద మేము పడవలలో వెళ్లి, ట్రోయ్‌నగరానికి ముట్టడివేసి, తొమ్మిదేళ్ల పాటు అతి క్రూరమైన యుద్ధం సాగించాము. మా యోధులలో ఎందరో ఆ యుద్ధరంగాన ప్రాణాలర్పించారు. ఆ సంఘటనలు చెప్పాలంటే అయిదారేళ్లు పడుతుంది.



తొమ్మిదేళ్లు నానా అగచాట్లూ పడి, చిట్టచివరకు దైవకృపవల్ల విజయం పొందగలిగాం. కాని ఉపజ్ఞలో ఒక్కడుకూడా మీ తండ్రి అయిన రూపధరుడికి చాలలేదు. మా ఇద్దరిమధ్య ఒక్కసారికూడా అభిప్రాయ భేదం రాలేదు. మా సలహాలు ఎప్పుడూ ఒకే విధంగా ఉండేవి. అయిందేదో అయిపోయిందా, తీరా తిరుగుప్రయాణం సాగించే సమయాన మాలో కక్షలు బయలుదేరాయి. రారాజుకూ, ప్రతాపుడికీ మధ్యనే అభిప్రాయ భేదం వచ్చింది. ఇద్దరూ మాటకు మాట అనుకున్నారు. ఇంకేముందీ? మిగిలిన యోధులుకూడా రెండు జట్లుగా చీలిపోయి,



ఆ అన్నదమ్ములలో ఎవరో ఒకరి పక్షమయారు. మర్నాడు ఉదయం సగం మందిమి పడవలలో ఎక్కి ప్రతాపుడివెంట బయలుదేరాం; మిగిలిన సగంమంది రారాజువెంట దేవతల నారాధించటానికి ఉండిపోయారు. మేము టెనెడోస్ చేరగానే మీ నాన్న వెనక్కు తిరిగిపోతున్నానన్నాడు. అతనివెంట కొందరు బయలుదేరారు. నేనూ, దేవమయుడూ మరికొందరూ సూటిగా ఇళ్లకు చేరుకున్నాం. ఇదే జరిగింది, నాయనా; నాకు మిగిలినవారి సంగతి తెలియదు. వజ్రకాయుడి కొడుకు నవయోధుడూ, అతని అనుచరులూ క్షేమంగా చేరారని విన్నాను. మరికొంతమందికూడా వారి వారి దేశాలకు క్షేమంగా చేరుకున్నట్టు తెలిసింది. రారాజు స్వదేశానికి చేరుకోవటమూ, అజబలుడు రారాజు భార్యతో కుట్ర చేసి ఆయనను దారుణంగా హత్యచేయటమూ నువు వినే ఉంటావు. రారాజు కొడుకు గట్టివాడు, అవకాశం సంపాదించి అజబలుణ్ణి చంపేసి తన తండ్రిహత్యకు పగ తీర్చుకున్నాడు."

ధీరమతి నవద్యోతుడితో, "అతను ఎంత అదృష్టవంతుడు! మా అమ్మను పెళ్లాడే ఉద్దేశంతో మా యింట తిష్ఠవేసి మా కొంప



గుల్లచేస్తున్న దుర్మార్గులపై నే నెప్పుడు పగ తీర్చుకుంటానోగదా!" అన్నాడు నిట్టూర్చుతూ.

"అవును, నాయనా, మీ ఇంట చేరిన దుర్మార్గుల సంగతి నేనూ విన్నాను. నువు వారిని ఎందుకు సహిస్తున్నావు? అందరూ నీకు శత్రువులేనా? అయినా ఆ బుద్ధిమతీ దేవి అనుగ్రహం నీపై ప్రసరిస్తే మీ నాన్నలాగే నువుకూడా శత్రువులనందరినీ త్వరలోనే నిర్మూలించగలుగుతావులే!" అన్నాడు నవద్యోతుడు.

వారు మాట్లాడుతూ ఉండగానే పొద్దు వాలింది. ధీరమతి తన నౌకకు తిరిగిపోవటానికి లేచాడు. కాని నవద్యోతుడు ఒప్పుకో లేదు. "ఈ రాత్రి రూపధరుడి కొడుకు పడవలో పడుకోవటమా? నాకు ఇల్లు లేదా? పక్కలూ, మెత్తలూ లేవా?" అంటూ అయన ధీరమతిని తన ఇంటికి తీసుకు పోయాడు. సహనుడు మాత్రం మిగిలిన నావికుల క్షేమసమాచారాలు చూడటానికి నౌకకు తిరిగివెళ్ళాడు.

మర్నాడు ఉదయం ధీరమతి నిద్రలేచి సుఖంగా స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. అతనిని ప్రతాపుడుండే చోటికి తీసుకుపోవటానికి ఒక గుర్రపుబండీ సిద్ధం



చేశారు. దారిలో తినటానికి భోజనం వెంట బెట్టుకుని నవద్యోతుడి కుమారుడు ఒకడు ధీరమతి వెంట బండిలో వచ్చాడు. వారిద్దరూ ఆ రోజూ మర్నాడూ ప్రయాణంచేసి ప్రతాపుడుండే దేశం చేరుకున్నారు.

సరిగా ఆ సమయానికే ప్రతాపుడు తన కుమార్తెను వజ్రకాయుడి కొడుకుకిచ్చి పెళ్ళి చేస్తున్నాడు. ఈ పెళ్ళికి పరిసర ప్రాంతాల నుంచి చాలామంది వచ్చారు. ఒక విశాల మైన సావడిలో విందులూ వినోదాలూ జరుగుతున్నాయి. ఇంతలో ప్రతాపుడి అంగ రక్షకుడొకడు వచ్చి, "మహారాజా, ఎవరో ఇద్దరు యువకులు బండిలో వచ్చి దిగారు.



వారిని లోపలికి ఆహ్వానించమన్నారా, లేక మరెక్కడికైనా వెళ్లమని చెప్పనా?" అని అడిగాడు.

ప్రతాపుడు చిరాకుతో, "నువు ఇంత మూర్ఖుడివని నాకు తెలియదే! మనం పరాయిదేశాలలో దిక్కులేని స్థితిలో ఎన్ని సార్లు ఇతరుల ఆతిథ్యం తీసుకోలేదు? వెంటనే వెళ్లి ఆ యువకులను భోజనానికి రమ్మను," అన్నాడు.

తరువాత కాస్సేపటికి ధీరమతీ, అతని అనుచరుడూ విందు జరిగే సావడిలోకి వచ్చి ఆశ్చర్యంతో చుట్టూ కలయజూశారు. ఆ సావడిలో సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నట్టుగా ఉన్నది. నౌకర్లు వచ్చి వారిని తీసుకుపోయి స్నానాలు చేయించి, బట్టలు కట్టబెట్టి, ప్రతాపుడి సరసనే వారిద్దరినీ భోజనానికి కూచోబెట్టారు.

ప్రతాపుడు వారితో, "నాయనలారా, మిమ్మల్ని చూస్తే రాజకుమారులల్లే ఉన్నారు గాని సామాన్యులలాగా లేరు. ముందు భోజనాలు చెయ్యండి; మీరెవరో, ఏం పనిమీద వచ్చారో తరవాత చెబుదురు గాని," అన్నాడు.

ఇద్దరూ భోజనం పూర్తి చేశాక ధీరమతి తన అనుచరుడి చెవిలో రహస్యంగా, "ఇక్కడ ఎంత కంచూ, ఎంత వెండీ,



ఎంత బంగారమూ, ఎంత దంతమూ ఉందో చూశావా ?" అన్నాడు. ఈ మాటలు ప్రతాపుడి చెవుల పడ్డాయి.

"నాయనలారా, నేనీ సంపద యావత్తూ నానాదేశాలు తిరిగి సంపాదించాను. కాని ట్రోయ్‌కోటగోడల ముందు నా అనుచరులు ఎందరో ప్రాణాలు విడిచారు; వారు బతికి ఉంటే ఈ సంపద లేకపోయినా నేను ఎక్కువ సుఖపడుదును. వారికోసం నేను అప్పుడప్పుడూ ఏడుస్తాను. అయితే అందరికన్న నేను అధికంగా ఏడ్చేది రూపధరుడి కోసం. ఒక్కొక్కరాత్రి అతను జ్ఞాపకం వచ్చి నేను నిద్రపోలేను. నా సంగతే ఇలా ఉంటే, వృద్ధుడైన అతని తండ్రీ, అతని భార్యా, కుమారుడూ రూపధరుడికోసం ఎంతగా ఏడుస్తున్నారో!" అన్నాడు ప్రతాపుడు విచారంగా.

ఈ మాటలు వినగానే ధీరమతికి దుఃఖం ఆగలేదు. అతను కళ్లు తుడుచుకుంటున్న సమయంలో భువనసుందరి అక్కడికి వచ్చింది.

ధీరమతిని చూస్తూనే ఆమె, "ఈ కుర్రవాడెవరో గాని మూడుమూర్తులా రూపధరుడి లాగే ఉన్నాడుకాదూ ?" అన్నది.

"నిజమేసుమా !" అన్నాడు ప్రతాపుడు ధీరమతికేసి చూస్తూ.





నవద్యోతుడి కొడుకు ప్రతాపుడితో, "మహారాజా, మీరన్నది నిజమే. ఇతను రూపధరుడి కుమారుడే. రూపధరుడు లేని కారణంచేత పాపం అతని ఇల్లు కుక్కల దొడ్డిలాగా అయింది. అతను పెద్ద చిక్కులో వున్నాడు. మీరేమైనా అతనికి తగిన సలహా సహకారా లివ్వగలరేమోనని మానాన్నగారు నవద్యోతుడు నా వెంట ఈ కుర్రవాణ్ణి మీవద్దకు పంపారు," అన్నాడు.

"రూపధరుడి కొడుకు నా యింటికి రావటం ఎంత చిత్రం!" అన్నాడు ప్రతాపుడు. తరవాత రూపధరుణ్ణి గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. రూపధరుడు తన ఒంటినిండా దెబ్బవాతలు వేయించుకుని, గ్రీకుశిబిరంనుంచి పారిపోయిన బానిస రూపంలో ట్రోయ్‌నగరం ప్రవేశించటమూ, అలా మారురూపంలో వున్నప్పటికీ తాను అతనిని గుర్తించటమూ గురించి భువనసుందరి చెప్పింది.

తామంతా కొయ్యగుర్రంలో కూచుని ఉన్నప్పుడు భువనసుందరి వచ్చి లోపల ఉన్నవారిని పేరు పేరునా పిలిచినప్పుడు, వారిలో కొందరు బయట పడబోతూండగా రూపధరుడువారించిన వృత్తాంతం ప్రతాపుడు చెప్పాడు. అప్పుడు ధీరమతి, "మహారాజా, మా తండ్రివార్తలు మీకేమైనా తెలుసునేమో కనుక్కుందామనే ఉద్దేశంతో నేను వచ్చాను. మీకు తెలిసినదేమైనా ఉంటే దాచకుండా చెప్పండి," అన్నాడు.

"నాకు తెలిసినది చెబుతాను విను. నేను ఈజిప్టుదేశంలో చిక్కుకుపోయిన సమయంలో నాకు సముద్రాలమీద ఉండే ముసలివాడు తటస్థపడ్డాడు. ఆయన నాకు అనేకమందిని గురించి చెబుతూ, రూపధరుడు తన అనుచరులనందరినీ కోల్పోయి ఏదో దీవిలో బందీగా సమ్మోహినికి చిక్కి ఉన్నాడని తెలిపాడు," అన్నాడు.

—(ఇంకా ఉంది)






ఢిల్లీని పరిపాలించిన పాదుషాలలో అలా ఉద్దీన్ ఖిల్జీ ఒకడు. ఇతను చాలా దుర్మార్గుడు. ఇతనిలో రెండు విచిత్రమైన గుణాలుండేవి. ఒకటి, ప్రపంచాన్ని జయించాలనే కోరిక; రెండవది, అద్భుత సౌందర్యవతులందరూ తన భార్యలు కావాలనే కోరిక.

అలా ఉద్దీన్ రాజపుత్ర రాజ్యాలను జయించే ఆలోచనలో ఉన్న సమయంలో అతనికి పద్మిని సౌందర్యం గురించి తెలియవచ్చింది. వెంటనే అతనికి ఆమెను తీసుకురావాలనే కోరిక కలిగింది.

మేవారు రాజ్యానికి చిత్తూరు రాజధాని. మేవారుకు రాజైన లకుమ్సీ పసివాడు కావటంచేత ఆ కుర్రవాడికి మారుగా అతని పినతండ్రి భీమసింగు రాజ్యం నిర్వహిస్తున్నాడు. పద్మిని భీమసింగు భార్య. ఆమె జన్మస్థానం సింహళదేశం. అందంలోపద్మినికి సాటివచ్చే స్త్రీ ఆ కాలంలో మరొకతె లేదు.

తాను రెండవ అలెగ్జాండరునని చెప్పుకునే అలా ఉద్దీన్ పద్మినిని తన పరాక్రమంతో గెలవ నిశ్చయించి, తన సైన్యాలను చిత్తూరు దుర్గంపైకి నడిపాడు. ఈ దుర్గం కొండపై ఉన్నది. దానిని గెలవటం సులభసాధ్యం కాదు. అలా ఉద్దీన్ సేనలు కొండను చుట్టుముట్టాయే గాని, చిత్తూరు దుర్గాన్ని జయించలేకపోయాయి.

రాజపుత్రులు అభిమానధనులు. వారు తమ ఆత్మగౌరవాన్ని దక్కించుకోవటానికి ప్రాణాలనుకూడా అవలీలగా బలిచేస్తారు. చిత్తూరు దుర్గాన్ని వారు అత్యంత శౌర్య సాహసాలతో సంరక్షించుకున్నారు. రాత్రీ పగలూ అన్న విచక్షణ లేకుండా అలా ఉద్దీన్ తన సైన్యాలను చిత్తూరుదుర్గంపైకి పంపాడు. పంపినప్పుడల్లా ఆ సైనికులు రాజపుత్రుల చేతులలో నాశనం కావటం తప్ప మరొక ఫలితం లేకపోయింది.

సి. జగన్మోహనరావు

అలాఉద్దీనుకు నిరుత్సాహం పట్టుకున్నది. పద్మిని నిజంగా సౌందర్యవతి అవునో కాదోకూడా తెలుసుకోకుండా అతను తన సైన్యాలను ఆమెకోసం ఆహుతి చేస్తున్నాడు. హాయిగా ఢిల్లీలో అనేకమంది సౌందర్యవతులైన భార్యలుండగా తన కిదేం గ్రహచారం?

అలాఉద్దీన్ చిత్తూరు ముట్టడి చాలించి తిరిగి పోయే స్థితిలో ఉండగా భీమసింగు సంధిరాయబారం పంపాడు. అలాఉద్దీన్ ముట్టడి చాలించి వెళ్ళిపోయినట్టయితే బోలెడంత బంగారం ఇస్తానన్నాడు. చిత్తూరు ప్రజలు ముట్టడిమూలాన పడుతున్న అగచాట్లు చూడలేక, వారికి తిండికూడా లేకపోవటం గమనించి, భీమసింగు ఈ సంధి రాయబారం పంపాడు.

కాని ఈ మాట వినగానే అలాఉద్దీన్ పద్మినిని కాజెయ్యకుండా తిరిగి పోగూడదనుకున్నాడు. అతను రాయబారితో, "ప్రపంచంలో పద్మినిని మించిన సౌందర్యవతి లేదంటారు. ఆమెను ఒక్కసారి చూడనిచ్చినట్టయితే నేను సంధికి ఒడబడతానని రాజా భీమసింగుతో చెప్పు!" అని అతను రాయబారితో అన్నాడు.

ఈ మాట వినేసరికి చిత్తూరులోని రాజపుత్రుల రక్తం ఉడికి పోయింది. కాని





ప్రజల సుఖం కోరి వారు అలాఉద్దీన్ కోరిక నెరవేర్చ నిశ్చయించారు. "రేపు నీవు ఒంటరిగా, ఎట్టి ఆయుధాలూ లేకుండా చిత్తూరుదుర్గానికి వచ్చినట్టయితే నీ కోరిక నెరవేరగలదు," అని వారు అలాఉద్దీనుకు జవాబు పంపారు.

రాజపుత్రులు అడిన మాట తప్పరని అలాఉద్దీనుకు తెలుసు. అందుచేత అతను ఒంటరిగా, నిరాయుధుడై చిత్తూరు దుర్గానికి బయలుదేరాడు. కాని అతని మనసులో ఒక నీచమైన ఆలోచన ఉన్నది. మోసంతో పద్మినిని కాజెయ్యటానికి అతను ముందుగానే పథకం వేశాడు.

కాపలావాళ్లు పాదుషాను లోపలికి సగౌరవంగా రానిచ్చారు. భీమసింగు అయనకు స్వాగతమిచ్చాడు. చక్కగా అలంకరించిన దర్బారు భవనంలోకి అలాఉద్దీన్ ప్రవేశించి అక్కడ పద్మినిని చూశాడు.

కాని అయన పద్మినిని ప్రత్యక్షంగా చూడలేదు. ఒక అద్దంలో ఆయనకు పద్మిని ప్రతిబింబం కనబడింది. ఒక అద్దం కాదు, వరసగా పన్నెండు అద్దాలలో పన్నెండుసార్లు ప్రతిబింబించిన పద్మిని రూపాన్ని పాదుషా చూశాడు. అయినప్పటికీ పద్మిని నిజంగా జగన్మోహిని అని ఆయనకు తెలిసిపోయింది.



చిట్టచివరకు అలాఉద్దీన్ కళ్ళు పక్కకు తిరిగాయి. ఆయన వెళ్లిపోవటానికి బయలు దేరాడు. భీమసింగు ఆయనను సాగనంప టానికి వెంటవెళ్ళాడు. అవమానంతో ఏడు స్తున్న పద్మినిని అంతఃపుర స్త్రీలు ఓదార్చారు.

అలాఉద్దీను కొండ దిగి వచ్చేటప్పుడు భీమసింగు వద్ద పద్మిని సౌందర్యాన్ని తెగ పొగిడాడు. ధర్మానికి కట్టుపడనివాడైతే భీమసింగు ఆ నీచుణ్ణి సులువుగా గొంతు పిసికి చంపిఉండును.

ఇద్దరూ ముస్లిము గుడారాలను సమీ పించారు. పద్మినిని తన భార్యను చేసుకోవా లన్న కోరిక పాదుషాకు మరింత ఎక్కువ అయింది. ఆయన తన భటులకు కనుసైగ చేశాడు. మరుక్షణమే వారు భీమసింగుపై బడి బంధించి ఒక గుడారంలో ఖైదుచేశారు.

ఈ అత్యాచారం గురించి విని రాజ పుత్రులు నిశ్చేష్టులయారు. తమ రాజును విడిపించమని వారు అలాఉద్దీనుకు కబురు చేశారు. పద్మినిని తన పరం చేస్తే భీమసిం గును విడిచిపుచ్చగలనని అలాఉద్దీను జవాబు పంపాడు.

వారం రోజులపాటు రాజపుత్రులు మథనపడ్డారు. లకుమ్సీ కుర్రవాడు. భీమ సింగు ఖైదీ అయాక చిత్తూరు పౌరులకు సరిఅయిన నాయకుడు లేడు. ఇప్పుడు



అన్నిటికీ పద్మిని ఒకతే బాధ్యురాలు. ఆమె సభ చేసి అందరినీ సమావేశపరిచి, తన బంధువైన గోరాసింగును సేనానాయకుడుగా నియమించి, భీమసింగును రక్షించటానికి ఒక ఉపాయం తెలిపింది. ఆమె వేసిన పథకాన్ని ఆచరణలో పెట్టటానికి సభికు లందరూ ఒప్పుకున్నారు.

చిత్తూరు నుంచి గోరాసింగు దూతగా పాదుషా వద్దకు వచ్చి, "చక్రవర్తీ, మీరు మా రాజును విడిచిపెట్టే పక్షంలో పద్మిని మీవద్దకు వస్తుంది. కాని ఆమెవెంట దాసీ జనంకూడా రావటానికి ఏలినవారు అనుమతించాలి!" అన్నాడు.

పాదుషా ఆనందానికి మేరలేదు. "పద్మిని తనకు ఉచితమైన హోదాతో రావచ్చును. మా ఆక్షేపణ లేదు. కాని ఆమె వెంటనే బయలుదేరి రావాలి," అన్నాడాయన.

"రాణీ వెంట రక్షకభటులు కొద్దిమంది రావచ్చునా?" అన్నాడు గోరాసింగు.

"వద్దు, వద్దు! ఇది పెళ్లి; యుద్ధం కాదు!" అన్నాడు, అలాఉద్దీన్ నవ్వుతూ. గోరాసింగు తిరిగి వెళ్లిపోయాడు.

పాదుషా తన సైనికులను పిలిచి, "ఈ రోజు మనకు పండగ, మీ యిష్టంవచ్చినట్టు విందులూ, విలాసాలూ జరపండి," అని ఉత్తరువిచ్చాడు. శిబిరమంతా ఆనందోత్సా



హాలలో మునిగితేలుతున్న సమయంలో 700 మేనాలు కొండదిగి వచ్చాయి. ఒక్కొక్క మేనాను అరేసి బోయీలు మోస్తున్నారు. ముస్లిము సైనికులు ఆ మేనాల జోలికి పోలేదు.

పాదుషా తనకు గల విలవైన దుస్తులను ధరించి, తన గుడారాన్ని చక్కగా అలంకరించి పద్మిని రాకకై ఎదురుచూస్తున్నాడు. మేనాలన్నీ ఆయన గుడారం దగ్గిర దిగాయి. గోరాసింగు గుడారంలోకి వెళ్లి అలాఉద్దీన్‌తో, "పద్మిని వచ్చింది. ఏలినవారు భీమసింగును విడిపించాలి!" అన్నాడు.

"అప్పుడే కాదు. ముందు నేను పద్మినిని పెళ్లాడాలి! తరవాత భీమసింగు విడుదల!" అన్నాడు అలాఉద్దీను.

"అయితే పద్మినిని తన భర్తకు వీడ్కోలు చెప్పనివ్వండి," అన్నాడు గోరాసింగు. పాదుషా దీనికి బలవంతాన ఒప్పుకున్నాడు. పద్మిని భీమసింగున్న గుడారంలోకి అడుగు పెట్టగానే భీమసింగు మితిలేని ఆశ్చర్యంతో, "నువా?" అన్నాడు.

"అరవకండి. ఇదుగో కత్తి! బయట రెండు గుర్రాలు సిద్ధంగా ఉన్నాయి. పారిపోదాం, పదండి!" అన్నది పద్మిని.

పహరావాళ్లు మోసం తెలుసుకునేలోపుగా భీమసింగూ పద్మినీ గుడారం బయటికి వచ్చి గుర్రాలెక్కి చిత్తూరుమార్గం పట్టి పారిపోసాగారు. సరిగా ఆ సమయానికే మేనాలన్నిటినుంచీ సాయుధ యోధులు బయటికి వచ్చి ముస్లిము సేనలపై పడ్డారు. ఆ మేనాలను మోసినవారుకూడా సైనికులే. దాదాపు అయిదువేల రాజపుత్రులకూ, ముస్లిములకూ, ఘోరయుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో రాజపుత్రులు చాలా హెచ్చు సంఖ్యలో మరణించారు. అయితే అలాఉద్దీన్ సేనకూడా నాశనమయింది. అలాఉద్దీన్ కోపంతో, నిరాశతో ముట్టడి ఎత్తి ఢిల్లీకి తిరిగి వెళ్లిపోయాడు.





# న్యాయమైన తీర్పులు

పూర్వం సింహళదేశంలో ఒక వర్తకు డుండేవాడు. ఆయన సముద్ర వర్తకంచేసి చాలా లక్షలు గడించాడు. ఆయన వృద్ధుడై చనిపోయే సమయంలో తన కొడుకైన జయపాలుణ్ణి పిలిచి, అతనికి తన వ్యాపారం వప్పగించి, "నాయనా, నువు కూడా నాలాగే సముద్ర వ్యాపారం చెయ్యి. కాని పొరపాటునకూడా వంచకమహాపట్టణానికి వెళ్ళకు," అని సలహా చెప్పాడు.

తండ్రి పోయాక జయపాలుడు తన నాలుగు నౌకలనూ తీసుకుని వ్యాపారం చేయసాగాడు. వంచకమహాపట్టణానికి పోతే ఏమి జరుగుతుందో తెలుసుకోవాలని అతనికి కుతూహలం పుట్టింది. అతను తెలివిగలవాడు; అందుచేత, ఎవరైనా తనను మోసం చేసినా తాను ఎత్తుకు పైఎత్తు వేయగలనన్న ధైర్యం అతనికున్నది. కనుక అతను తన నాలుగు నౌకలనూ నడిపించుకుని ఆ పట్టణానికి వెళ్ళాడు. అది సూర్యోదయంవేళ. నౌకలను రేవులో ఉంచి జయపాలుడు తన విల్లూ, బాణాలూ వెంట పెట్టుకుని తీరంవెంబడి వేట షికారుకు బయలుదేరాడు. ఒకచోట అతనికొక నీటి కొంగ కనబడింది. అది సముద్రంలోని చేపలను వేటాడుతున్నది. జయపాలుడు తన విల్లు ఎక్కుపెట్టి గురిచూసి ఆ కొంగను కొట్టాడు. ఒక్క బాణంతో ఆ కొంగ చచ్చి సముద్రపునీటిలో పడిపోయింది.

ఆ సమీపంలో చేపలను పట్టుతూ ఉన్న పల్లెవాడొకడు ఇది చూసి జయపాలుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎవరయ్యా నువ్వు? నా తండ్రిని చంపావు. నీ మీద రాజుగారితో ఫిర్యాదు చేస్తాను చూస్తూ ఉండు!" అన్నాడు.

"ఆ కొంగ నీ తండ్రా?" అని జయపాలుడు ఆశ్చర్యంతో అడిగాడు.

జి. బాలచంద్రయ్య

"అవును. కిందటి జన్మలో నా తండ్రి. ఇప్పుడు నీటికొంగ జన్మ ఎత్తి నాకు చేపల వేటలో సహాయపడుకున్నాడు!" అన్నాడు పల్లెవాడు.

జయపాలుడికి కోపం వచ్చింది. "పో, దిక్కున్న చోట చెప్పుకో!" అని చేపలు పట్టేవాణ్ణి గదమాయించాడు.

తరవాత అతను నగరం ప్రవేశించి నడుస్తూ ఉండగా ఒక మనిషి ఎదురై, "ఎన్నాళ్ళకు కనపడ్డావు, బాబూ! చాలా కాలం క్రితం నేను నా కుడిచెవి మీ తండ్రి గారివద్ద తాకట్టు పెట్టి పది రూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లిస్తాను. నా చెవి నాకు ఇప్పించు," అన్నాడు జయపాలుడితో.

జయపాలుడు నిర్ఘాంతపోయి, మనిషి కేసి చూశాడు. అతనికి ఎడమ చెవి మాత్రమే ఉన్నది; కుడిచెవి లేదు. "మా నాన్నగారు నీ చెవి గురించి నాకేమీ చెప్పలేదే!" అన్నాడతను ఆ మనిషితో.

"నా చెవి నాకిప్పించక పోతే నేను నీ పైన ఫిర్యాదు చేస్తాను చూసుకో!" అంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు.

జయపాలుడు మరికొంతదూరం వెళ్ళే సరికి ఒక స్త్రీ ఎదురై, "చూడు, నాయనా! పదహారేళ్ళక్రితం మీ నాన్నగారు ఈ వూరు



వచ్చి నన్ను పెళ్ళాడి, తనదారిన తాను వెళ్ళిపోయారు. నాకు మనోవర్తి కింద పది వేల రూపాయలిస్తానని ఆయన మాట ఇచ్చారు. ఆ డబ్బు నువు ఇస్తావా, లేక ఫిర్యాదు చేయమన్నావా?" అని అడిగింది.

జయపాలుడు ఈ దుర్మార్గాన్ని సహించలేక, "పో, నేను నీకు దమ్మిడీకూడా ఇవ్వను!" అని తన నౌకల వద్దకు తిరిగి వెళ్ళాడు. అక్కడ రేవులో అతనికి ఒక మంగలి కనిపించి, "క్షౌరం చెయ్యమంటారా, బాబూ?" అన్నాడు.

"ఏం తీసుకుంటావు?" అని అడిగాడు జయపాలుడు.

"నన్ను సంతోషపెట్టండి, దొరా!" అన్నాడు మంగలి.

జయపాలుడు సరేనని వాడిచేత క్షౌరం చేయించుకుని ఒక రూపాయి ఇవ్వబోయాడు. మంగలి తీసుకోలేదు. అయిదు రూపాయలిచ్చినా వాడు నిరాకరించాడు. జయపాలుడికి ఆగ్రహం వచ్చి, "నీకు నేనేమీ ఇవ్వను. దిక్కున్నచోటుకు వెళ్ళి చెప్పుకో!" అన్నాడు.

చేపలు పట్టేవాడూ, చెవిలేనివాడూ, అడవీ, మంగలీ—ఈ నలుగురూ రాజసభకు వెళ్ళి జయపాలుడిపైన ఫిర్యాదులు చేశారు. జయపాలుణ్ణి రాజసభకు పిలిపిం





చారు. విచారణ ఆరంభమయింది. మొదట చేపలు పట్టేవాడు రాజుగారితో, "మహారాజా, చచ్చిపోయిన నా తండ్రి నీటికొంగగా పుట్టి నాకు చాలాకాలంగా చేపలవేటలో సహాయంచేస్తూంటే ఈ మనిషి ఆ కొంగను కాస్తా చంపి నాకు తీరని నష్టం కలిగించాడు," అన్నాడు.

రాజుగారు జయపాలుడికేసి తిరిగి, "ఈ చేపలు పట్టేవాడికి ఒక నౌక పరిహారం ఇయ్యి!" అన్నాడు.

తరవాత చెవిలేనివాడు ఫిర్యాదుచేశాడు. "మహారాజా, ఈమనిషి తండ్రి దగ్గర నా కుడి చెవి తాకట్టుపెట్టి పదిరూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లువేస్తాను, నా చెవి నాకు ఇప్పించమంటే ఈ మనిషి నన్ను దిక్కున్నచోట చెప్పుకోమన్నాడు," అని వాడన్నాడు.

రాజుగారు తీర్పు చెబుతూ, జయపాలుడు చెవిలేని వాడికి ఒక నౌకను పరిహారంగా ఇవ్వమన్నాడు.

తరవాత స్త్రీ జయపాలుడిపైన ఫిర్యాదు చేసింది. ఆమెకుకూడా రాజుగారు జయపాలుడి నౌక ఒకటి ఇవ్వపలసిందిగా తీర్పు చెప్పాడు.

అఖరుకు మంగలి వచ్చి ఫిర్యాదు చేశాడు. "అయ్యా, ఈయన నాచేత క్షౌరం చేయించుకుని నన్ను సంతోషపెడతానన్నాడు. ఆయన నౌక ఒకటి నా కిప్పిస్తే నేను సంతోషిస్తాను. అంతకంటె తక్కువ అయితే నేను సంతోషించను!" అన్నాడు.

"మంగలి చెప్పేది సబబుగానే వున్నది. అందుచేత జయపాలుడు మంగలికి ఒక నౌకను ఇచ్చుకోవాలి!" అని రాజుగారు తీర్పు చెప్పాడు.

ఈ ఫిర్యాదులూ తీర్పులూ విని జయపాలుడు నిర్ఘాంతపోయాడు. ఈ నగరానికి పంచకమహాపట్టణమని పేరెందుకు వచ్చిందో, అక్కడికి వెళ్లవద్దని తండ్రి

ఎందుకు సలహా ఇచ్చాడో అతనికి బాగా తెలిసివచ్చింది. అతని మెడలోవున్న రత్న హారం తప్ప మిగిలిన అతని అస్తియావత్తూ పోయింది. "ఇప్పుడు ఏంచెయాలి? ఈ ఇక్కట్టులోనుంచి ఎలా బయటపడాలి?" అని అతను ఆలోచిస్తూ ఉండగా రాజ సభ లోకి రాజుగారి కొడుకు పదేళ్లవాడు వచ్చాడు.

వెంటనే జయపాలుడు తన మెడలో వున్న రత్నహారం తీసి రాజకుమారుడి మెడలో వేశాడు. సభలో అందరూ చప్పట్లు కొట్టి హర్షధ్వానాలు చేశారు.

రాజుగారుకూడా తన కొడుకును దగ్గిరికి పిలిచి, అతని మెడలో వున్న రత్నహారం చూసి ముచ్చటపడ్డాడు.

జయపాలుడు సభికులకేసి తిరిగి, "నేను రాజకుమారుడికి ఈ రత్నహారం ఇచ్చి నందుకు ఈ సభలో సంతోషించనివారెప రైనా వున్నారా?" అని అడిగాడు.

"లేరు, లేరు!" "సంతోషించాం!" అని అందరూ కేకలుపెట్టారు.

జయపాలుడు మంగలికేసి తిరిగి, "ఏమోయ్, నీ మాటేమిటి? నువుకూడా సంతోషించావా?" అని అడిగాడు.

మంగలికి సంతోషించానని చెప్పక తప్పిందికాదు.



జయపాలుడు రాజుగారికేసి తిరిగి, "మహారాజా, మంగలిని సంతోషపెట్టాను. అందుచేత వాడికి నేను నౌక నివ్వనవసరం లేదనుకుంటాను!" అన్నాడు.

"అవును, అవసరం లేదు!" అన్నాడు రాజుగారు.

తరవాత జయపాలుడు స్త్రీకేసి తిరిగి, "అమ్మా, నీ మనోవర్తి విషయం ఒక సంగతి చెప్పాలి. ఆ మనోవర్తి నీకు ఇస్తాను, కాని ఒక్క చిక్కున్నది. మా దేశాచారంప్రకారం భార్య భర్తతో సహగమనం చేయాలి. దురదృష్టవశాత్తూ మా తండ్రి గారు ఏడాది క్రితం పోయారు. అందుచేత



నువు చితిపేర్చుకుని చనిపోయినట్టయితే నీవారసులకు పదివేలిస్తాను," అన్నాడు.

"నేను బలవంతాన ఒక్కనాటికి చావను!" అన్నది స్త్రీ. జయపాలుడు రాజుతో, "మహారాజా, నేనీమెకు పరిహారం చెల్లించ నవసరం లేదనుకుంటాను," అన్నాడు. రాజు సరేనన్నాడు.

తరవాత జయపాలుడు చెవిలేనివాడితో, "బాబూ, నీచెవి నీ కిప్పించటానికికూడా నా కభ్యంతరంలేదు. మాతండ్రిగారి హయాంలో ఎన్నో వేలమంది తమ చెవులు తాకట్టు పెట్టి నీలాగే ఋణాలు పుచ్చుకున్నారు. వాటిలో నీ చెవి పోల్చటం సాధ్యంకాదు. అందుచేత నమూనాకింద నీ ఎడమ చెవి కోసి ఇచ్చావంటే దానితో సరిపోల్చి నీ రెండు చెవులూ నీకు పంపుతాను," అన్నాడు.

ఇందుకు చెవిలేనివాడు ఒప్పలేదు. వాడికి పరిహారం ఇవ్వనవసరంలేదని రాజుగారు తీర్పు ఇచ్చాడు.

తరవాత జయపాలుడు రాజుగారితో ఇలా అన్నాడు:

"మహారాజా, నా తండ్రిగారు చనిపోయాక చేపగా పుట్టి నాకు నౌకలు నడపటంలో సహాయపడుతూ ఉన్నసమయంలో ఈ చేపలుపట్టేవాడి తండ్రి కొంగరూపంలో వచ్చి ఆయనను మింగేశాడు. అందుచేత నేనా కొంగను చంపాను. చేపరూపంలో వున్న మా తండ్రి ఆ విధంగా చనిపోకపోతే నేనీ నగరంచాయలకు రావటమే జరిగేది కాదు!" అన్నాడు..

రాజుగారు ఈ మాట విని సంతోషించి, చేపలు పట్టేవాడికికూడా పరిహారం ఇవ్వ నవసరంలేదని తీర్పు చెప్పేశాడు.

తరవాత జయపాలుడు ఒక వారం రోజులపాటు రాజుగారి అతిథిగా వుండి ఆయనవద్ద కొన్ని బహుమానాలు పొంది, తన నాలుగు నౌకలను తరలించుకుని తన దేశానికి వెళ్లిపోయాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 అగస్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆట మాణిక్యమే, పాట మాణిక్యమే

రెండవ ఫోటో : మా యింటి అమ్మాయి మంచి మాణిక్యమే

పంపినవారు : నంబూరి సుశీలాదేవి, C/o నంబూరి అంజనేయులు

17/48 నల్లావారి వీధి, విశాఖపట్టణం

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# గబ్బిలాలు

గబ్బిలాలు నిజమైన పక్షులు కావని మనం అదివరకే తెలుసుకుని ఉన్నాం. అవి మనుషుల లాగే స్తనజంతువులు. అందుచేత అవి ఇతర పక్షులలాగా గుడ్లుపెట్టి పొదగటానికి మారుగా పిల్లలను కని, వాటికి పాలిచ్చి పెంచుతాయి.

గబ్బిలాల శరీరాలపై రోమాలుంటాయి. వాటి రెక్కలు నిజమైన రెక్కలు కావు. మనిషిచేతిలో ఉండే ఎముకలే గబ్బిలం రెక్కలో ఉంటాయి. అయితే వాటి "వేళ్లు" చాలా నిడుపుగా ఉండి వాటిమధ్య చర్మపుపొర ఉంటుంది. ఈ పొర సహాయంచేతనే అవి ఎగురుతాయి. ఎగిరే గబ్బిలం తన రెక్కలను ఒక సెకండుకు 15 సార్లు ఆడిస్తుంది.

మనం సాధారణంగా గబ్బిలాలను పగటివేళ ఏ చెట్లమీదనో తలకిందుగా వేళ్ళాడు తూండగా చూస్తాం. ఇలా వేళ్ళాడే గబ్బిలాలను కబోదిపక్షులంటాం. "గుడ్డి గబ్బిలాయి" అనే మాటనుబట్టి గబ్బిలాలకు కళ్ళు కనిపించవని కొందరు అనుకుంటారు: అయితే ఇది నిజంకాదు. గబ్బిలాలకు కళ్ళున్నాయి. కాని కటికచీకటిలో ఎగిరేటప్పుడుకూడా గబ్బిలాలు దేనికీ కొట్టుకోవు.

రాత్రివేళల ఎప్పుడైనా ఒక గబ్బిలం మన ఇళ్ళలో జొరబడినప్పుడు అది అతివేగంగా గదిలో తిరుగుతుంది, కాని దేనికీ కొట్టుకోదు. దీనికి కారణమేమంటే గబ్బిలాలు ఎగిరే టప్పుడు తమ కళ్ళకన్న చెవులను ఎక్కువగా ఉపయోగిస్తాయి; అవి తమ నోటితో ధ్వనిచేసి



దాని ధ్వనికి వచ్చే ప్రతిధ్వనిని ఆలకించి, ఆ ప్రతిధ్వనిద్వారా తమ దారికి అడ్డంగా ఉన్న వస్తువులను గ్రహించి పక్కకు తొలుగుతాయి. అందుచేతనే గబ్బిలాన్ని కళ్ళుమూసేసి గదిలో ఎగరనిచ్చినా, అది దేనికీ కొట్టుకోకుండా తిరుగుతుంది, కాని చెవులు మూసేస్తే ఎగరలేదు.

గబ్బిలాలు నోటితో ధ్వని చేస్తాయని మనకు ఎలా తెలుసు? ఈ ధ్వని మనం ఎన్నడూ వినం. కాని అవి ధ్వని చేస్తాయని, "రాడారు" యంత్రంతో రుజువు చేశారు. ఆ ధ్వని మన కెందుకు వినపడదంటే, అది చెవికి వినబడనంత హెచ్చుస్థాయిలో ఉంటుంది. మనిషి చెవి వినలేని హెచ్చుస్థాయి గల ధ్వనులను కుక్కలుకూడా వినగలవు.

గబ్బిలాలు గూళ్ళు కట్టవు. ఎత్తయిన ఇళ్ళకప్పులలోనే ప్రకృతి సిద్ధంగా లభించే కంతలలోనే పిల్లలను కని పెంచుతాయి. గబ్బిలం పిల్ల బరువు తల్లి బరువులో నాలుగోవంతో అయిదోవంతో ఉంటుంది. పుట్టినప్పుడే గబ్బిలం పిల్ల గోళ్లు బాగా పెరిగి ఉంటాయి. ఒక్కొక్కప్పుడు తల్లి ఆహారం వేటాడబోయేటప్పుడు పిల్లనుకూడా వెంట తీసుకుపోతుంది.

గబ్బిలాలకు శత్రుభయం దాదాపు లేదని చెప్పవచ్చు. అందుచేత పుట్టిన పిల్లలు సాధారణంగా అకాలమరణం పాలుకావు. అమెరికాలో గబ్బిలాలను గురించి పరిశోధనలు చేసినవారు 11 ఏళ్లకుపైగా బతికిన గబ్బిలాలనుకూడా గమనించారు.

గబ్బిలాలను చూసి మనం అసహ్యించుకుంటాం గాని, వాటివల్ల మనకు నష్టం ఏమీ లేదు. మనకు అపకారం చేసే కీటకాలను తిని అవి మనకు ఉపకారం చేస్తాయికూడా!



# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్'ను వెంటబెట్టుకుని కాలవ దగ్గిరకు వెళ్లారు. అక్కడ గట్టుమీదవున్న పెద్ద కుర్రవాడొకడు, వాళ్లకు అడ్డు తగిలి, "కాలవలో మొసలివున్నది. రెండణాలిస్తే, దాన్ని పట్టుకుని ఎత్తుకు వెళతాను. మీరు హాయిగా స్నానంచేయవచ్చు!" అన్నాడు. ఇంతలో, 'టైగర్' కాలవ ఒడ్డునే వెళ్లి, అక్కడ ఉన్న మొసలిని నోట కరుచుకుని పారిపోసాగింది. అదిచూసి పెద్ద కుర్రాడు, "ఏయ్ హేయ్! మీ కుక్క అరణాలుపెట్టి కొన్న నా రబ్బరుమొసలిని ఎత్తుకుపోతున్నది!" అని అరవసాగాడు. దాసూ వాసూలు పొట్టలు చెక్కలయేలా నవ్వుకుని, కాలవలో హాయిగా స్నానంచేశారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# ప్రెసిడెంట్
## టాయ్‌లెట్స్






ప్రెసిడెంట్
డిలక్స్ టాయ్‌లెట్ పౌడరు
—రమణీయ సౌందర్యానికీ,

★

ప్రెసిడెంట్ స్నో
—సుందరమైన వర్చస్సుకు

సినిమాతారలందరిచే
వాడబడుతున్నవి.

**RATHOD TRADING CO., MADRAS-1**

---

*Worth any price*

*"And yet priced low"*

**Nutrine**
**SWEETS**

ది న్యూట్రిన్ కన్‌ఫెక్షనెరి కంపెని
లిమిటెడ్, చిత్తూరు (ఆంధ్ర)

Photo by S. H. Kotak



బహుమతి పొందిన వ్యాఖ్య — మా యింటి అమ్మాయి, మంచి మాణిక్యమే!

పంపినవారు: సుశీలాదేవి - విశాఖపట్నం

